అతిత్వరలో ఆంధ్ర దేశమంతటా విడుదల



# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO.**

సంపుటము **42**
సంచిక **25**

విరోధి సంవత్సర ఫాల్గున శుద్ధ పంచమి బుధవారము




'వర్షాగమనం'—
శ్రీ పి. యల్. నరసింహామూర్తిగారు.

# విషయానుక్రమణిక

## 22 ఫిబ్రవరి 1950

---



---



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ ఫిబ్రవరినెల 22-వ తేది బుధవారము

# దివంగతులు వేంకటశాస్త్రిగారు

ఆస్థానకవి కళాప్రపూర్ణ శతావధాని బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కామేశ్వరీఉపాసకులు కృష్ణాతీరమున కనకదుర్గాక్షేత్రమైన విజయవాడ యందు మహాశివరాత్రిపర్వదినమున ఎనుబది సంవత్సరముల వయసున పరలోకగతు లైరను వార్త ఆంధ్రలోకమును కంపింపజేసినది. వేంకటశాస్త్రిగారికిని, ఆంధ్రప్రజానీకమునకును గల సన్నిహితసంబంధము రక్తసంబంధముకంటె ఎక్కువ సూక్ష్మమైనది. ఎక్కువ సునిశితమైనది, శాశ్వతమైనది. అది హృదయసంబంధమైన అనురాగబంధము. ఆంధ్రప్రజాహృదయమును రంజింపజేసిన కవిహృదయము వేంకటశాస్త్రిగారిది. "కళాప్రవీణులగువారలయందె వసించు లోకముల్" అను సుభాషితమునకు వారి జీవితమే ప్రత్యక్షప్రమాణము. ఆంధ్రహృదయమును తన హస్తగతమైన వీణవలె మీటి కంపింపజేసి, పంచకావ్యములైన బరింపని విద్యార్థులచే తెనుగున తేనెలొలుకు తియ్యని పలుకులు పలికించిన ప్రజ్ఞాప్రభావము వేంకటశాస్త్రిగారు గడించిన యశశ్రీ.

. 79 సంవత్సరముల వయస్సులో జీర్ణవిశీర్ణదేహులైయున్నస్థితిలో వారిని మద్రాసుప్రభుత్వము ఆస్థానకవిగా స్వీకరించి సత్కరించిననాడు ఆ మహా రససిద్ధుడు "పదకొండేడుల పైని రెండిపుడు నా ప్రాయంబు" అని తన వయస్సునుగూర్చి చమత్కృతితో ప్రస్తావించెను. భౌతికదేహము బక్కచిక్కినను, రసప్రపంచమున ఆయన నిత్యయౌవనుడు. శాస్త్రిగారికి గల మనోరథము మహోదారమైనది. "లిపిధైశ్వర్యము లిచ్చి తింక నొకటే విశ్వేశి నీ సన్నిధిన్! కవిగా నుండ ననుగ్రహింపు మిదియే కామ్యంబు కామేశ్వరీ!" అని ఆనాడు సభావేదికపై చాటించిరి. ఆయన పూర్వజన్మసుకృతమున కవియై జన్మించెను. కవియై జీవించెను. కవియై వర్ధిల్లెను. కవులను వర్ధిల్లజేసి, కవియై తరియించెను.

ఆంధ్రసారస్వతమునందు వేంకటశాస్త్రిగారి జీవిత మొక ప్రత్యేకశకమనక తప్పదు. ఆంధ్రసాహిత్యమునందది వేంకటశాస్త్రియుగమని పేర్కొనబడుట నిశ్చయము. స్వతంత్రభారతభూమియందీ ఆంధ్రసాహిత్యయుగపురుషుడు ప్రప్రథమప్రభుత్వ ఆస్థానకవిగా పూజింపబడుటవల్ల అధునాతనసనాతన సాహిత్యసంప్రదాయములు శ్రీ శాస్త్రిగారియందు దివ్యముగా, నవ్యముగా సమన్వయమై సన్మానింపబడిన వనుట నిస్సందేహము.

శాస్త్రిగారు రంచించిన కావ్యములు, నాటకములు, పురాణములు ఎంత జనరంజకములో, వారి ఆశుకవితాప్రదర్శనములు, వారి ఆంధ్రపత్రికా ప్రకటితరసవిమర్శకాదివ్యాసములు అంతటి పండితపామరజనరంజకము లైనవి.

అన్వయకాఠిన్యములేని శైలి, పాండిత్యప్రకర్షకై పెనగులాడని పదలాలిత్యము, సహజభావోద్దీపనగల సహజభాషాలాపన ఇదియే వేంకటశాస్త్రిగారి ఆంధ్రసాహిత్యభిక్షు. ఇదియే నేటి తెనుగుపద్యగద్య రచనకు వారి మేలుబంతి. వారి రచనలు ఆచంద్రతారార్కమై తెనుగుబాస జీవించియున్నంతకాలము మెఱుగు తరుగని కబ్బములై వెలయగలవు. అమృతత్వమీయా రామద్రావిడభూసురేంద్రుని వచోమాధుర్యధుర్యంబైన సహజభాషాభావసమ్మేళనమునందంతర్గతమైయున్నది.

ఆయన రాజపూజితుడే కాడు. కవిరాజపూజితుడు. "అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత." అంతే కాదు. వేంకటశాస్త్రిగా రొక ఆంధ్రసాహిత్యపీఠమును

ప్రతిష్ఠించి. ప్రజాహృదయపీఠము నధిష్ఠించిన రససిద్ధులు. సాహిత్యదిగ్విజయ యాత్ర చేసిన కవిసమ్రాట్టులు. "కింకవీంద్రఘటాపంచాననులు"

వారి రచనలయందును, వారి శిష్య ప్రశిష్యుల యందును వారి కవిత్వసంప్రదాయముచే పెంపుసొంపు లందిన ఆధునికాంధ్రసాహిత్యమునందును వారి ప్రభావము ప్రకాశించుచున్నది. అందంతటను వారి యాత్మ అంతర్లీనమై విశ్వశ్రేయోదాయకమై విశ్వవ్యాప్తమైనది. అట్టి కళాప్రపూర్ణుని యాత్మకు నమస్కరించుచు, వారికి పరమేశ్వరుడు పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకము ననుగ్రహించుగాక యని ప్రార్థించుచున్నాము. వారి యాత్మజనులకు మా సానుభూతిని నివేదించుచున్నాము.

---

# ఆంధ్రరాష్ట్రము- ప్రభుత్వవైఖరి

గవర్నరుఉపన్యాసమునందు ఆంధ్ర రాష్ట్ర ప్రసక్తి లేనందుకు శాసనసభాసభ్యులు కొందరు చేసిన విమర్శలు సభానాయకుడు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి ఆగ్రహకారకమగుట సహజమే. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమున తొందరపాటు కూడదని, అన్ని అనుకూలించి, పరిపక్వమైనపుడె రాష్ట్రము దానికదె పండి, పడుట మంచిదని శ్రీ గోపాలరెడ్డిగారి అభిప్రాయము. కాని ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు సంబంధించి తొందరపాటుకంటె మందగతే ఎక్కువ ప్రమాదకరమని గత అర్ధసంవత్సరఅనుభవమువలన స్పష్టమైనది. కేంద్రప్రభుత్వము రాష్ట్రనిర్మాణబాధ్యతను పూర్తిగ చెన్నరాష్ట్ర ప్రభుత్వముపై నుంచెను. గవర్నరుప్రసంగమున ఈ ప్రస్తావన లేనికారణమున రాష్ట్రప్రభుత్వ వైఖరిని గురించి ఇంతవరకూ కల్గిన అపోహాలు, అనుమానములు, యథార్థములని స్థిరపడినవి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమువిషయమున చెన్నరాష్ట్రప్రభుత్వము ఇంక మీదట ఎట్టిచర్య తీసుకొనదని స్పష్టమైనది.

విమర్శలకు శాసనసభలో ఆర్థికమంత్రిసమాధానమువలన ఈ అసంతృప్తి తొలగుటకుబదులు తీవ్రతర మగుచున్నది. ప్రాజెక్టులవిషయములో, సిబ్బంది విషయములో. విభజనసంఘనివేదికలవలన బయల్పడిన లోట్లను సరిచేయుటకు రాష్ట్రప్రభుత్వము తగినచర్య తీసుకొనగలదని అయినను ఆర్థికమంత్రి హామీ నివ్వలేకపోయెను. అట్లే రాయలసీమలో తరుచు ఏర్పడే క్షామములనుండి ప్రజల రక్షించుటకు ఏర్పడిన "క్షామనిధి" ఇతరత్రా దుర్వినియోగ మగుటను నివారింపగలమని వాగ్దానము చేయలేకపోయిరి.

సభానాయకుడైనకారణముగ ఆర్థికమంత్రి, ఇతరమంత్రుల చర్యలను సమర్థింపవలసిన అవసరము కల్గుచున్నది. శాసనసభయందును మంత్రివర్గమునందును తమిళులే అధికసంఖ్య నున్నందున ఆంధ్రమంత్రులు చేయకల దేమియు లేదు. కనుకనే ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రము తక్షణము ఏర్పడవలెనని పట్టుబట్టిరి. కాలహరణమువలన, ఇంతకాలము ఉమ్మడిఆదాయముతో ఏర్పడిన "నిధులు" అన్నియు హరించిపోగల ప్రమాద మున్నది.

రాష్ట్రప్రభుత్వము ఆంధ్రులయందు నానాటికి అధికమగుచున్న ఈ అందోళనను గ్రహించి వ్యవహరింపవలసి యున్నది. ఆంధ్రరాష్ట్రనిర్మాణము వాయిదా పడినప్పటికిని ఆంధ్రులకు అన్యాయము జరుగదని తమ చర్యలద్వారా నిరూపింపవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వముపై నున్నది. 1950-51 సంవత్సరపు ఆయవ్యయఅంచనాలను తయారుచేయుటలోనైన ఆర్థికమంత్రి ఈ విమర్శల అంతరార్థమును గ్రహించి పనిచేయుదు రని విశ్వసించుచున్నాము.

# అశ్రుతర్పణము

## శ్రీ దివాకర్ల వేంకటావధాని

"అవతారంబు సమాప్త మయ్యెనె? తమిస్రాంతర్నిమగ్నాంధ్రముల్
వివిధార్థమ్ముల జూపి సాహసము నుద్వేగంబు చైతన్యముల్
రవులన్ జేయుచు దీర్చిదిద్దిన యపూర్వజ్యోతి చల్లారెనే?
భవముల్ వీడెనె వేంకటేశ్వరుడు మా ప్రారబ్ధమూలమ్మగన్." 1.

"మొన్నన్ జూ! గురుదేవ! నిన్ సుకవితామూర్ధాభిషిక్తుండవై
యున్నన్ జూచితి గేలుమోడ్చితి మనం బుప్పొంగగా నింతలో
గన్నుల్ గట్టిన వేమొ? దైవ మిటు సంకల్పించునే లేనిచో?
నిన్నున్ జూచి తరించు భాగ్య మిక లేనేలేదె? ముమ్మాటికిన్." 2.

"శ్రమగల్గింప జరాప్రవర్తితరుజాసాంగత్య మొప్పార మం
చముపైనుండియు నెక్కు కావ్యరచన ల్సాగింతు వారీతి నే
తమి నూరేడులు నాయు వుండుననగా దైవంబు చల్పాదియై
మము నిర్భాగ్యుల జేయుచున్ దివికి నిన్నాత్మ గొంపోయెనే?" 3.

"చటులస్ఫూర్తి నెసంగు వేదనను నిచ్చల్ మ్రింగితిన్ దండ్రి మా
రటరూపమ్మని నిన్ను గొల్చుచు భవత్ప్రస్థానమాలించి నం
తట నీనాడె గతించె నా జనకు డన్నట్లయ్యె దుఃఖాగ్ని నే
నెటు సైరింపగ నేర్తు సోదరుల నిం కేరీతి నోదార్తునో." 4.

"సమ్ముఖమందు నుండి తుదిసారి భవచ్చరణంబు లంటి ఫా
లమ్మున గేలుమోడ్చి యపరాధములన్ సహియింప వేడి బా
ష్పమ్ములు గ్రమ్మ నీదయిన భౌతికదేహము గాంచజాలు భా
గ్యమ్మ లభింపదయ్యెనకటా! యని చింతిలుచుంటి నెమ్మెయిన్." 5.

"మాయెడ బుత్రభావమున మా పిత యేగిననాటినుండియున్
బాయని కూర్మి జూపితి వపాయములన్ దొలగింపనేర్చి సు
శ్రీయుతులన్ బొనర్చ నొనరించిన దీవనయే యమోఘమై
సాయము జేయు మా కది యజస్రము వీడని యంగరక్షయై." 6.

"మరణం బన్నను సాజమంచును దలంపన్ బోక యాత్మీయులం
దరు దుఃఖించెద రెరు పోయినను విద్వన్మౌళిరత్నంబవై
చిరకాలం బధునాతనాంధ్రకవితాశ్రీ నేలుకొన్నట్టి ధీ
వరు గోల్పోవుటకన్న కష్టమును సంభావింపగావచ్చునే?" 7.

"చివ్వకు గాల్ద్రివ్వ చీకొట్టుగురునైన
సహియింపనేరని సాహసంబు
పలుకుపలుకున హాస్య మొలికించుచుం బోవు
సహజసంభాషణాచతురిమంబు
సభ్యుల నానందసమ్మోహితుల జేయు
శ్రావ్యగంభీరగళస్వనంబు
గుణ మున్నచో మెచ్చి కుఱ్ఱకైతలకైన
దార్ఢ్యమ్మ నొసగు నుదారగుణము."
"శిష్యవాత్సల్యగరిమ వశీకృతాఖి
లాంధ్రసుకవిప్రయోగిమార్గాంతరాళ
తక్షణజ్ఞప్తి సుస్వతంత్రప్రవృత్తి
మరచిపోవుదుమన్నను మరపురావు." 8.

"త్రవ్వకాలంది నీ సుమధురస్మృతి కంతము లేదు చింతయున్
నివ్వటిలున్ దురంతమయి నీవు బహిర్గతమైన కంటికిన్
దవ్వయినంతమాత్రమున దాపున లేవని యెంచరాదు నీ
మవ్వపుబ్రాయపు మా హృదయమందిరసీమల నుండు బూజ్యమై." 9.

"కవనార్థం బుదయించితిన్ సుకవితాకార్యంబె నావృత్తి యీ
భవ మద్దాన దరింతు నంటి విక నీ భావంబె సిద్ధించెలే
శివలీలల్ రచియించినాడవు శివశ్రీపుణ్యకాలమ్మునన్
శివసాయుజ్యము నొందబోయితివె వాసిన్ దత్కృపన్ గాంచుచున్." 10.

"ఎద జిరవిప్రయోగము సహింపగలేక సగౌరవంబుగా
బదిలముగా గిరీశ్వరుని పజ్జకు నిన్గొనిపోవ నెంచి నీ
కెదురుగ వచ్చె దిర్పతికవీంద్రుడు దివ్యులు చుట్టి కొల్వ నా
సదయులతో బ్రణామములు సల్పిరి నీ సుతు లంచు దెల్పుమా." 11.

"తిరుపతివెంకటేశ్వరుని దేవుడు మాకు దెలుంగునాట గో
ర్కులు సమకూర్చుచుండు ననీ కోటిజనుల్ వినుతింపుచుండు రా
దరమున దెల్గుభారతికి దైవముగా నలరారినట్టి నీ
చరణసరోజభక్తి మము సాకను తిర్పతి వేంకటేశ్వరా!" 12.

# శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి



సకలసౌఖ్యములనుభవించి సమృద్ధమైన యశస్సార్జించి యెనుబదిసంవత్సరములు గడపినవారైనను వార్ధకమున శరీరస్వాస్థ్యము తప్పినవారైనను, ఆయన మొన్న మహాశివరాత్రి పుణ్యకాలమున దివంగతులయిన వార్త విన్నంతనే మనస్సు చివుక్కుమన్నది-ఆయన జన్మస్థానము కడియము. నాది కడియపులంక. దేశప్రసిద్ధులు నిరతాన్నదాతలునై ధవళేశ్వరముం దుండి వందలకొలది విద్యార్థులను పండితులను గావించిన కీర్తిశేషులగు చర్ల బ్రహ్మయశాస్త్రిగారి మొదటి శిష్యుడాయన. నే నా సబ్రహ్మచర్యుల కడపటి శిష్యుడను. రమారమి యేబదిసంవత్సరములుగా బాగా పరిచితులము కావున శాస్త్రిగారి యెడబాటు విచారకరమగుట సహజముగదా! అదియే యీ స్మృతికి మూలము.

తిరుపతి వేంకటేశ్వరకవుల కించుక పూర్వమే దేవులపల్లి సుబ్బారాయశాస్త్రి తమ్మన్నశాస్త్రిగార్లు శతావధానఖ్యాతిని గాంచిరి. అంతకు మున్నను శతావధానములు తెలుగుదేశమున లేకపోలేదు, అయినా, శతావధానము, తిరుపతి వేంకటేశ్వరోపజ్ఞమన్న విఖ్యాతి వీరికే వరించినది.

వేంకటశాస్త్రిగారు బందరుహైందవ హైస్కూలులో నాంధ్రపండితులుగా ప్రవేశించుటకు మొదట నించుక సంకోచించిరి గాని, అదియే యాయన కవితాభిరుచియు శతావధాననైపుణియు శిష్యప్రశిష్యముఖమున దేశమంతటా మారుమ్రోగుటకు మూలమైనది.

తిరుపతి వేంకటకవులు సమకాలకవులతో నవధానులతో నందందు పోరాటము సాగించిరి గాని, యదియే వీరి కవితాశతావధానసామర్థ్యమును గీరతాదిముఖమున దేశము నలుగడల చాటినది. వీరి కవితావివాదము వీరి మేలునకే యైనది.

ఈ జంటకవులు తొలుదొల్త కోకనాడలో శతావధానము చేయు సమయమున నేను ధవళేశ్వరములో రఘువంశ మారంభించి చదువుచున్నాను. వా రష్టావధానములు చేయుచు, నడుమనడుమ మా పాఠశాలకు వచ్చుచు వారి పద్యములు శ్రుతిరంజకముగా చదువుచుండిరి. అదియే బ్రహ్మయశాస్త్రిగారి పాఠశాలలోని విద్యార్థిపరంపరలో కవిత్వమంకురించుటకు మూలమైనది. తిరుపతిశాస్త్రిగారు ముప్పదియేండ్ల క్రిందట కీర్తిశేషులైనను, ఆయన మొన్నటివఱకును వేంకటశాస్త్రిగారితో కలసి జీవించియున్నట్లే యుండెడిది. మొన్నటితో తిరుపతి వేంకటేశ్వరులు తిరుపతి వేంకటేశ్వరునిలో లీనమైరి.

"వాడు తిరుపతి, వేంకటేశ్వరుడ నేను,"
వెరసి తిరుపతి వేంకటేశ్వరుల మేము.

అన్న వీరి మాట మొన్నటితో సార్థకమైనది. ఆంధ్రదేశమున వీరు త్రొక్కని సభ లేదు. పొందని రాజగౌరవము లేదు. ఎఱుగని కవితారహస్యము లేదు. తుదకు వేంకటశాస్త్రిగారు చెన్నరాజధాన్యాస్థానకవిపదము నధిష్ఠించి కవితాగౌరవపారంగతులైరి. చాలును. ఆయనజన్మ సార్థకము. ఇక నాయన భౌతికదేహముతో నొందు సుఖము గాని గౌరవముగాని మిగిలియుండలేదు. చిరకాలముగా కామేశ్వరీధ్యాన మొనరించుచున్న యాజీవాత్మ, మహాశివరాత్రినాడు పరనారీశ్వరునిలో నైక్యమందినది. "నరః పతితకాయోఽపి యశఃకాయేన జీవతి"

మ. సూ. శా.



# శ్రీ చెళ్లపిళ్లవారి విశిష్టత

## శ్రీ జటావల్లభుల పురుషోత్తము

కవులలో శ్రీ వేంకటశాస్త్రిగారి విశిష్టతను స్మరించుట కిది సమయము.

సాధారణముగా ప్రముఖ రాజకీయనాయకుల నామము మాత్రమే ఊరూర, వాడవాడల వ్యాపించును. కవిపండితుల కీర్తికి లోకైకని పైకొల్పి యుండదు. దీనికి శ్రీ శాస్త్రిగారి విషయ మపవాదము.

షేక్స్పియరును ఆంగ్ల్యాంగ్లకవిగా నిర్ణయించిన విమర్శకులు అతని రచనలనుండి లోకములో ప్రాసంగికోదాహరణయోగ్యములుగా వ్యాపించినన్ని పద్యములు మరి యే కవిరచనలనుండియు వ్యాపించక పోవుట యాతని శ్రైష్ఠ్యమున కొక కారణమని చెప్పియున్నారు. ఈ పరీక్షతో చూచినచో మన కవులలో శ్రీ వేంకటశాస్త్రిగారి స్థానము మొదటిదని నిర్వివాదముగా చెప్పవచ్చును.

మన మెరిగియున్నంతవరకు జనసామాన్యమునకు కూడ సారస్వతాభిరుచిని కల్గించినవారు తిరుపతివెంకటకవులే యని చెప్పవలయును. వీరి సర్వాంధ్రదేశవ్యాప్తశతావధానపర్యటనము లోలోన దాగియున్న యే యింత కవితావాసనకలవానికైనను కవియగుట కుత్సాహమును, శక్తిని కల్గించినదని చెప్పవచ్చును. వీరి శిష్యులును, ప్రశిష్యులును సహస్రసంఖ్యాకులుగా నున్నారు. ఇంత మంది శిష్యులు మరి యే యితర కవికిని లేరను నది నిస్సందేహము. అంతియే కాదు. నేటి ప్రముఖకవులలో ననేకులు వీరి శిష్యులే యగుట గమనింపదగినది.

అవధానములు, అనువాదములు, నాటకములు, పురాణములు, కథలు, విమర్శలు — అవియివి యన నేల? సర్వరంగములలోను శ్రీ శాస్త్రిగారి కవిత విలసిల్లినది. వీరి పాండవనాటకములు వీరికి కేవలకవులుగానే కాక నాటకకవులుగా కూడ శాశ్వతకీర్తి నార్జించినవి.

శ్రీ శాస్త్రిగారి పద్యపఠనకౌశలము ముఖ్యవిశిష్టాంశములలో నొకటి. సంస్కృతభాషలో "కల" శబ్దమునకు "అవ్యక్తమధురము" అర్థము. దానికి లక్ష్యభూతమైనది నాకింతవరకు శాస్త్రిగారి పద్యపఠనపద్ధతియే కన్పట్టినది. వారి ననుకరించువారికి కూడ నా మాధుర్యములో ఏ కొంచెమో వచ్చుచునే యుండుననుటయే వారి పఠన ప్రశస్తికి సాక్ష్యము.

శాస్త్రిగారి కవిత్వము వారి పద్యములలోనే కాదు! మాటలలో కూడ నుండెను. ఉపన్యాస వేదికపై వారెంత సేపు మాట్లాడినను శ్రోతలకు విసుగను నది లేకుండెను.

కాలదైర్ఘ్యములో కూడ శాస్త్రిగారి కవితాసేవ యసాధారణము. అరువదిసంవత్సరము లవిచ్ఛిన్నముగ సర్వతోముఖ సారస్వత సేవ చేసినవారు తెలుగునాటనే కాక ప్రపంచములోనే యరుదు.

ఆ మహామహుని మరచుట యెట్లు సాధ్యము? అవ్యక్తమధురమైన యా ధ్వని యవ్యక్తమై యెన్నియో శతాబ్దములు కవికుమారుల నుల్లాసపరచుచు ఆంధ్రాళికి గర్వస్థానమై యలరారగలదు.

---

# పితృనిర్వాణము

శ్రీ చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి (వేంకటశాస్త్రిగారి కుమారులు)

"తిరుపతి లేడటన్న వెలితిన్ గనుపింపగనీక వెంకటే
శ్వర ! కవితాసరస్వతి కుపాయనపూజ లొనర్చి సత్కృపీ
డ్గురువరమూర్తివై నెగడి కొండొక వ్యాధినెపంబునన్ గురూ ?
పరమశివైక్య మందితివె ? భవ్యమహాశివరాత్రిరోజునన్"

"కారణజన్ముండవుగా ధారుణి కరుదెంచి తెనుగుతల్లి సుతుడవై
సారస్వతశాఖలలో తీరులు సరిదిద్ది వడలితివె ? స్వస్థలికిన్"

"కవనార్థం బవతార మెత్తి జగతిన్ గంపింపగా జేసి మా
నవలోకంబున నింత కెక్కుడగు స్థానం బేమి లేదన్న గౌ
రవమున్ బొంది శతావధాని కవిసామ్రాణ్మూర్తివై నేటికిన్
శివసాయుజ్యపు టగ్రపీఠి గవితాసింహాసనం బెక్కితే ?"

"కానన్ రా దిక నీదు కాయము యశః కాయం బెగానీ! ప్రబో
ధానన్ మ మ్మసిగొల్పి జ్ఞానహితబోధల్ చేయుటల్ లేవు-వి
జ్ఞానాంభోనిధులైన పుస్తకములే గానీ ? భవన్మూర్తిను
త్ప్రాణంబిం కభయం బొసంగుటకు లేదా ! తండ్రి ! మా కీపయిన్."

"పుట్టినదాది నీవు చనిపోయెడిదన్కను దైవికాంశతే
పట్టముగట్టుకొన్న విభవద్విభవంబున - గొప్పగొప్ప సా
మ్రాట్టుల కందరాని యసమానవిలాసవిహారమొత్తు సా
మ్రాట్టువుగా తుదిన్ శివుని ప్రక్క మహాకవిరాజు వైతివా ?"

"ఒకరక మైన దీనదశ నున్న సరస్వతి నుద్ధరించి దే
శకపదమం దపారముగ శిష్యుల సృష్టియొనర్చి కైతలో
శకపురుషుండవై యుపనిషత్ప్రవచనంబును విన్చి గన్నమూ
సికొనిన తండ్రి ! నీ వమరజీవివిగా సుఖియింపు మచ్చటన్"

"చెప్పమరచినాడ శ్రీపాదగురువులు
నిన్ను జూడ వచ్చియున్నవారు
కాని నీవు లేవు - కడసారి నిను జూచి
పొంగుచున్న దుఃఖమును భరించి."

"నేను బిడ్డలేని నిర్భాగ్యుడైతిని
నీవు తండ్రిలేని నిసుగు వైతి,
వనుచు బొక్కి నన్ను నాశ్వాస మొనరించి
వెళ్లినారు తండ్రి ! వింటివొక్కొ ?"

"నాన్నా యీవరదాక నెట్లొ మదిలోనన్ ధైర్యమున్ బూని నే
నున్నా నైనను పొంగులై వడలు దుఃఖోద్వేగ మాపంగలే
కున్నా నెంత విరాగ మూని నను - నేనా ? మానవుండన్ గదా ?
నన్నున్ మన్ననజేయు మీ యపకృతిన్ మన్నించి దీవించుమున్."

"ధన్యతమజీవివైన నీతనువుగూర్చి
యేడ్వరాదని యెరుగుదు - నేమిచేతు ?
కంటికిన్ రెప్పవలె జూచు కన్నతండ్రి
యెదుట లేకున్ననాడు నే నేమి చేతు ?"

"మా దురదృష్టజీవితము మాట దలంచుకొలంది వేదన
చ్ఛాదితమై మనస్సు వివశత్వము జెందుచు నుండె కృత్రిమా
హ్లాదము లేమిచేయగల ? వైనను మాకిక దండ్రిలేని లో
టీదృశబాధలో సమయుటే విధిలేఖనమా ? కవిత్పితా !"

## గీతమాలిక

తెలిసి తెలియని తనమున గలసియున్న
మనుమడున్ మన్మరాలు, నీ తనువు కాల్చి
తిరిగివచ్చిన నాగుండె కరగిపోవ
"అన్న మెవ్వరు పెట్టెద రచట తాత"

కనుచు నను ప్రశ్న జేసినయంత కడుపు
తరుగుకొనిపోయి దుఃఖమ్ము పొరలిపోయె
గడ్డపెరుగున కలవాటుపడ్డవాండ్ర
కేమి ప్రత్యుత్తరం బిత్తు నింక నేను ?

అనుగుకుమారులన్ మరచునట్లు భవత్పరిచర్యసేయు న
ల్లుని వనటన్ గనుంగొనుటలో బ్రవహింపుచునున్న కంటినీ
టిని యరికట్టు టెట్లు ? ప్రకటీకృతమా విధిచే దిలోని బం
ధన మది త్రెంపరానిదిగదా ? పెనుమాయజగత్తులోపలన్.

మును భీష్మంబలె నుత్తరాయణమహాపుణ్యంపు గాలమ్మునన్
ఘనమౌ నీ శివరాత్రినాడు శ్రవణానక్షత్రమం దంపశ
య్యనుబోల్ శయ్యను-భౌతికంబయిన కాయంబున్ సదావీడి యీ
శునిలో నైక్యము గొన్న నీకు నివిగో జోహార్లు వేవేల్ పితా !

భావతరంగాలు :

# జేబులో వింతలోకం

నా జన్మకల్లా ఒకేఒక్కసారి జేబు కొట్టేశాను. కానీ - బహుశా పరధ్యానంలో ఉన్నానుకాబోలు - అది తరవాత చెప్తాలెండి. మొత్తానికి జరిగినది జేబుదొంగతనం. అలా జేబుకొట్టెయ్యడంలో అత్యంత జాగ్రత్తతో చుట్టూ చూశాను. సమయం కనిపెట్టాను. ఆ జేబు తనంతటతానే వచ్చి నా చెయ్యిదగ్గర ఆత్మార్పణచేసుకుంది. ఇంక నా హస్తలాఘవాన్ని కళాభిజ్ఞతను చూపాను. నా కౌశలానికి నాకెంతో తృప్తి కలిగింది.

దొంగతనం చేసేటప్పుడు చేతిలోకే వస్తువొస్తుందో కుతూహలంతో కనిపెట్టి చూస్తున్నాను. ఒక్కొక్కటే బయటికి తీసి చూస్తున్నాను.

అసలప్పుడు నేను రైల్లో మూడో తరగతిపెట్టెలో దూరప్రయాణం చేస్తున్నాను. అప్పుడే సాయంకాలం కావస్తోంది. నేల ఆకాశం బొత్తిగా చచ్చురంగుల్లో, మరీ రంగులో నీళ్లెక్కువైనట్లు చిత్రించబడ్డాయి. వాన పడుతోంది. బొత్తిగా రంగూ రూపమూ లేదు. కాలక్షేపానికి చేతులో పుస్తకమూ పత్రికా ఏవీ లేవు. రైలుపెట్టెలో గోడల్లో మాస్తే ఎడ్వర్టైజ్‌మెంట్లు కూడా లేవు. ఉంటే వాటినైనా దీక్షగా పరీక్షచేస్తూ కాలం గడిపేవాణ్ని. అసలు అచ్చుపడిన అక్షరాల్ని చూస్తోంటే మానవుడి అద్భుత ప్రజ్ఞావిశేషాల్ని గురించి తలపోస్తూ ఆ అక్షరాలకేసి చూస్తూ ఎంతసేపైనా కాలక్షేపం చెయ్యవచ్చును.

మాటవరసకి సన్‌లైట్‌సోప్ ఎడ్వర్టయిజ్‌మెంటు ఉందనుకుందాం. సబ్బుచుట్టూ కిరణపంక్తులు చూస్తూఉంటే సూర్యుడు జ్ఞాపకం వస్తాడు. సూర్యారాధనా, పొద్దుచూసి చెంపలు వాయించుకునే గృహిణులు జ్ఞాపకం వస్తారు. ఆపైన వింధ్యాద్రి ఊరికే ఆకాశంలోకి పెరిగిపోయి సూర్యుడిరథాన్ని అడ్డగించడం, అగస్త్యమహర్షి ఆ పర్వతాన్ని అణిచి దక్షిణాదికి యాత్రచేసి వెళ్లిపోవడం మొదలైన పురాణకథలు జ్ఞాపకం వస్తాయి. అవన్నీ అయిపోయినతరవాత ఎదురుగా ఉన్నది సబ్బు అని జ్ఞాపకం వస్తుంది.

కాని ఇవన్నీ యోచిస్తూ గడపడానికి ఎడ్వర్టయిజ్‌మెంట్లేవీ లేవు. లోపల పొడుగునా చెక్కలు తప్ప ఇంకేమీ కనిపించడం లేదు. బయట తేమా తుంపరా మాత్రం కనిపిస్తోంది. కొంచెం మందం, జడత్వం ఆవహించేట్టుంది.

అయితే కాలక్షేపం చెయ్యడానికి బొత్తిగా ఏదీ లేదంటే ఒప్పుకోను. గోడల సందుల్లోనూ బెంచీల్ని పరీక్షగా చూడ్డం మొదలెట్టాను. చెక్కల్ని గురించి ఆలోచిస్తున్నాను. యేసుక్రీస్తు వడ్రంగి ఎందుకైనాడు? తాపీపనెందుకు చెయ్యలేదు? గుడ్డలెందుకునెయ్యలేదు? అదెందుకో తెలిసివచ్చింది. తెలియగానే జేబులోకి చెయ్యి దానంతటదే వెళ్లింది.

అప్పుడు అకస్మాత్తుగా తెనిసివచ్చింది. నా జేబులో నాకు తెలియని నిక్షేపం ఎంత ఉంది? ఆలోచిస్తున్నకొద్దీ ఆశ్చర్యమయింది. మొదట్లో నా జేబుని ఆ వస్తువుల్ని నింపినప్పుడు అవి చాకనీ సుద్దముక్కనీ అనుకున్నాను. కాని ఆ జేబులో ఇంతటి సంపద చేరిందన్న సంగతి ఇప్పటివరకూ తెలియలేదు.

ఇప్పుడు తట్టింది నాకు. ఆ జేబులో నిక్షేపాన్ని హస్తగతం చేసుకోవాలి. ఆ జేబు కొట్టాలి. అదినా జేబే. అయితేం అక్కడేముందో నాకు పూర్తిగా తెలియదు. మెల్లిగా ఎవరికీ తెలియకుండా అందులోనించి ఏవస్తువొస్తుందో చూడాలి. మెల్లిగా జేబులో వస్తువుల్ని చడీచప్పుడూ లేకుండా సంగ్రహించి పరిశీలించడం ఆరంభించాను. చాలా చిత్రవిచిత్రాలైన వస్తువులు చిక్కాయి.

మొట్టమొదట చేతిలో కొచ్చినవి పాత బస్సుటిక్కట్లు. టిక్కట్లపైన చదవడానికి కావలసినంత విషయం దొరికింది. ఒక టిక్కట్టువెనక ఏదో ఒకరకంమాత్రల్ని గురించి చరిత్ర, ప్రశంస వ్రాసిఉన్నాయి. శాస్త్రవిజ్ఞానబద్ధమైన ఒక చిన్న వ్యాసం ఉంది. ప్రతివాక్యం అతిశ్రద్ధతో చదివాను. చదవడంకాదు. అభ్యసించాను. వాక్యాల్లో మెళుకువలు ఛెణుకులు కనిపించాయి. మంచీ చెడుగుల్ని గురించి ఆరోగ్యం అనారోగ్యాల గురించి మనుషుల అలవాట్ల దురలవాట్లను గురించి వాగ్వివాదా లున్నాయి. వాదప్రతివాదాల్ని గురించి నాలో నేను చర్చించుకోడం మొదలెట్టాను. కొంతసేపు గడిచిపోయింది. నిజానికి ఇల్లా రోజులుకొద్దీ గడప వచ్చునిపించింది.

తరవాత మళ్లీ మెల్లిగా చెయ్యి జేబులోకి పోనిచ్చాను, ఈమాటేమొస్తుందో అని ఆశ్చర్యపడుతూ. చిన్నచాకు చేతికి తగిలింది. చొక్కా కదలకుండా శరీరానికి తగలకుండా బయటికి లాగాను. చాకు చూసేసరికి దాని పుట్టుపూర్వోత్తరాలు నీతి, దౌర్జన్యప్రవృత్తి మొదలైన ఆలోచనలనేకం ముసురుకొచ్చాయి. నిజానికివన్నీ కలిపి రాస్తే ఉద్గ్రంథం తయారవుతుంది. చాకుచూస్తూవుంటే మానవుల నాగరికత ఆదికాలంలోని అనేకవిషయాలు జ్ఞాపకానికొచ్చాయి. ఇదే - ఈ వస్తువు పూర్వీకుల ఆధారంపైనే నాగరికత నిర్మించబడింది. ఈనాటి మన నాగరికత పునాదుల్లో ఇదొకటి. నాగరికతలో ఉచ్చనీచవ్యవస్థలకి ఇది కూడా ముఖ్యహేతువయింది. లోహాలున్నాయి. ఇనుము, ఉక్కు మొదలైన విచిత్రవస్తువులు. లోహంపూర్వచరిత్ర తలుచుకోడం మొదలెట్టేసరికి ఏదో స్వప్నప్రపంచంలోకి తేలిపోయాను. పెద్దవృక్షాలు అల్లిబిల్లిగా అల్లుకున్నతీగలు, పొదలతో నిండిన భయంకరారణ్యాలు. ఆ అరణ్యాల్లో ఆదిమానవుడు రాళ్లే ఆయుధాలుగా, రాళ్లని అరగదీసుకుంటూ వీలైన రాళ్లకోసం వెతుకుతూ తిరుగుతున్న ఆ ఆదిమానవుడికి ఒక రోజున అకస్మాత్తుగా ఈ వింత రాయి దొరికింది. వింతరాయిని ఆ మానవుడు కనిపెట్టాడన్నమాట. అప్పుడు ఆశ్చర్యం ఆనందం అతని ముఖంలో వింతదీపాలు వెలిగించి ఉండాలి. అప్పుడు రాతిఆయుధాలికీ లోహపు ఆయుధాలికీ మధ్య ఏదో అర్థం కాని ప్రచ్ఛన్నయుద్ధం జరిగిఉంటుంది. తళతళామెరిసే ఈ వింత

(31-వ పేజీ చూడుడు)

రిష్టువాచీలు తాళంచెవులూ తినే

# ఉష్ట్రపక్షి





[ఆర్థర్ టి. హారిస్]

నాలుగేళ్ల వయస్సులో నేను మాఅమ్మ వెంట దక్షిణాఫ్రికాలో ఉన్న మా తాతగారి ఊరు వెళ్లాను. అక్కడ మా తాతగారికి పెద్దపొలముంది. అక్కడ ఉష్ట్రపక్షుల్ని పెంచి ఈకల్ని ఎగుమతిచేసేవారు. విశాలమైన మైదానం చుట్టూ ముళ్ల తీగె ఉండేది. ఆమధ్య మైదానంలో ఉష్ట్రపక్షులికి (వీటినే నిప్పుకోళ్లంటారు) అడవుల్లో ఉన్నంత స్వేచ్ఛ ఉండేది. ఆరోజుల్లో, అంటే ఈ శతాబ్దం ఆరంభంలో వీటి ఈకెలు విరివిగా అమ్ముడుపోయేవి. ఒక పౌను ఈకలఖరీదు 300 డాలర్లుండేది.

దీనిపేరు ఉష్ట్రపక్షే అయినా ఈ పక్షి ఎగరలేదు. రెండే బొటనవ్రేళ్లుంటాయి. కోళ్లకున్నమాదిరిగా వెనకవేలుండదు. మరీ పొడుగైన మెడ. పక్షులజాతిలో కెల్ల పెద్దది. ఈమాదిరిపక్షులు దక్షిణమెరికా ఆస్ట్రేలియాలలో కూడా ఉన్నాయి. న్యూజీలాండ్‌లో ఇంతకన్న పెద్ద పక్షులుండేవికాని అవి ఏనాడో అంతరించిపోయినయ్. కాని అన్నిటిలోకీ దక్షిణాఫ్రికాలో పక్షుల ఈకలే పాశ్చాత్యస్త్రీలలో కొన్ని బాగా ఆకర్షించాయి. దక్షిణాఫ్రికాలో ఈవర్తకంకోసం పెద్దపెద్ద మైదానాల్లో ఈ ఉష్ట్రపక్షుల్ని పెంచేవారు.

కాలి పెద్దవేలు, కత్తివంటి పెద్దగోరు మొదలు పిడికెడు బుర్రవరకూ ఎత్తుకొలిస్తే, దాదాపు ఎనిమిదడుగు లెత్తుంటుంది. గోధుమ రంగు కళ్లు పెద్దపెద్దవి ఉంటాయి. బరువు 300 పౌనులుంటుంది. శరీరమంతటా రెక్కల పొడుగునా మెత్తని నల్లఈకలు చిన్నవి కప్పి ఉంటాయి. లోరెక్కలు, తోకల్లోమాత్రమే తెలని ఈక లుంటాయి. పొడుగైన సన్నని మెడ. పొడుగైన సన్నని కాళ్లు.

ఉష్ట్రపక్షులు ఎగరలేవు కాని రెక్కలెత్తుకొని పరుగులుతీస్తుంటే చూడవలసిందే. గుంపులో కొన్ని ఇటూ కొన్ని అటూ దోవా తెన్నూ తెలియకుండా పరుగుతీస్తాయి. కళ్ళతో చూస్తూనే ఉంటాయి కాని స్తంభాల్నీ చెట్లనీ ఢీకొంటాయి. కళ్లలో భయం తప్ప మరేదీ కనిపించదు. ఉష్ట్రపక్షి ఒకసారి బెదిరించిందంటే పరుగు ఆరంభిస్తుంది. ఇంక దాన్నెవరూ ఆపలేరు. ఆయాసమైనా రావాలి. లేకపోతే ఏ చెట్టునో దేన్నో ఢీకొని ఆగిపోవాలి.

అడుగులు తడబడ్డం అంటే ఎలా ఉంటుందో చూడాలంటే ఉష్ట్రపక్షిని బెదిరించి పరుగులెత్తిస్తే చాలు. ఆ పొడుగాటి కాళ్లు ఎటు అడుగు వెయ్యాలో తెలియక, గాలికి కొట్టుకుపోతున్నట్లు చివరికి ఎటు తూగితే అటు అడుగులేస్తాయి. పరుగుపెడుతుంటే ఎదురుగా మిట్టపల్లాలు కనిపిస్తాయి. చెట్లూ చేములూ కనిపిస్తాయి. అవి కనిపించేసరికి పక్షికి కళ్లలో బెదురు మరీ మించిపోతుంది. కాని అటు అడుగులు వెయ్యకుండా కాళ్లు వెనక్కిపట్టి నిభాయించుకునే తెలివి లేదు. అలా గోతిలో పడి కాళ్లూ మెడా విరగ్గొట్టుకోవలసిందే. ఒకసారి నేనూ మా తాతా మైదానంలోకి వెళ్లాం. గడ్డి తింటున్న రెండు నిప్పుకోళ్లు ముందు మా రాక కనిపెట్టలేదు. దగ్గరికి వెళ్లాక ఉలిక్కిపడి తడబడుతున్న అడుగుల్తో ఇటూ అటూ పరుగులెత్తడం మొదలెట్టాయి. మా తాత ఖంగారు పడ్డాడు. వీటి తెలివితేటలు ఆయనకి తెలుసును. అవి కొంతదూరం పరుగెత్తాక ఎదురుగా ఒక గొయ్యి వచ్చింది. మొదటి పక్షి దూకి తూల్తూ అవతల పడింది. రెండో పక్షి తిన్నగా గోతిలోకి దూకి క్షణంలో చచ్చిపోయింది. మొదటిపక్షి గొయ్యి దూకినతరవాత పరుగెత్తి పరుగెత్తి తీగకంచెదగ్గర కెళ్లి నిర్ఘాంతపోతూ చూస్తూ నిలబడిపోయింది.

మొదట కంచెమీద పడ్డట్లుంది. తోడ గీరుకుపోయి లోతైనగాయం కనిపిస్తోంది. దీనికి దెబ్బ తగిలినట్లైనా ఇంకా తెలిసిరానట్లుంది.

"అసలు వాటికి మెదడు ఉండీ లేనంత ఉంటుంది. ఉన్న కొద్దినరాలూ ఏదో అరుగుదలకీ పెరుగుదలకీ మెడ చాపడానికి సరిపోతాయి."

గాయమైనచోట కుట్టడానికి మెదలెట్టాడు మా తాత. ఆట్టే గంతులెయ్యకుండా ఉండడంకోసం ఒక మేజోడు తీసి ముఖంమీంచి మెడవరకూ తొడిగాడు. చిన్న దబ్బనం తీసుకుని పరిశుభ్రపరచబడిన గట్‌తో కుట్టాడు. దానికి చీము కుట్టినట్లైనా లేదు. నిబ్బరంగా నిలబడిఉంది.

అయితే ఉన్న కాస్తంత నెత్తిమీదా ఏపాటి చిన్న దెబ్బ తగిలినా నిప్పుకోడి క్షణంలో చచ్చిపోతుంది. ఒకసారి బడినుంచి వస్తుండగా ఒక నిప్పుకోడి మీదకు వచ్చింది. చిన్న బొమ్మరాయి తీసి విసిరాను. అది కర్మవశాత్తు దాని తలకి తగిలింది. ఉన్న పట్టుని అది నేలమీద కూలిపోయి కాళ్లు కొట్టుకుంది. మరుక్షణంలో చచ్చిపోయింది.

నిప్పుకోడికి కోపం వచ్చినప్పుడు ముక్కు, మోకాళ్లు ఎర్రబడతాయి. మెడ వెనక్కి భుజాలవరకూ లాగుతుంది. రెక్కలు విప్పి వెనక్కి కూచుంటుంది. తరవాత ఒక కాలు తలకంటె పైకెత్తి పదునైన గోటితో చీరెయ్యడానికి ప్రయత్నిస్తుంది. అయితే ఆసమయానికి నేలమీద పడుకుంటే ఆ పక్షి ఏమీ చెయ్యలేదు. గురిచూడ్డం చేతకాదు. అందుబాటులో ఉన్నప్పటికీ కోపంలో కాలెత్తి గురిచూసి కొట్టేసరికి గురికి రెండడుగులు ఎడంగా నేల చీరుకుపోతుంది. మళ్లీ కాలెత్తేలోగా సావధానంగా మనం లేచి ఒళ్లు దులుపుకొని దాని మెడ పట్టుకుంటే చాలు. అదేమీ చెయ్యలేదు. ఒక్క గుంజా గుంజితే కళ్లు చీకట్లు కమ్ముతాయి కాబోలు తెల్లబోయి చూస్తూ నిలబడిపోతుంది. లేదా మెడపట్టుకుని కిందికి వంచితే చాలు కదలకుండా నిలబడిపోతుంది. ఆపైన గట్టిగా ఏం చేసినా అది అది చచ్చి పోతుంది.

ఉష్ట్రపక్షులమీద స్వారి చెయ్యవచ్చునని చెప్తారు. కాని అది కట్టుకథ. అది నడుస్తున్నప్పుడు దాని నడుమువంక చూస్తే చాలు. అంత నిలకడలేని ఇరుసుమీద కూచోగలగడం అసంభవం. సరిగ్గా కాళ్లమీదుగా కూచోవాలి. కూచున్నతరవాత బరువు ఇటు తూగినా అటు తూగినా కింద పడవలసిందే.

భయపడినప్పుడు తప్పించుకోడానికి నిప్పుకోడి తన తలని ఇసుకలో దూర్చి ఉండిపోతుందంటారు. ఇదీ కట్టుకథే. గుడ్లు పొదిగేటప్పుడు శత్రువు కనిపించినప్పుడు తల నేల కానించి నిశ్చలంగా నిలబడ్డం ఆడనిప్పుకోళ్ళని చూశాను. బహుశా శత్రువు తనని గుర్తుపట్టకుండా ఒక గుట్టలా కనిపించడానికి అది అలా చెయ్యవచ్చును. పగలు ఆడపక్షులు, రాత్రి మగపక్షులు గుడ్లను పొదుగుతాయి.

జంతువుల్లో కాని పక్షుల్లో కాని ఇంతటి జడప్రాణి మరొకటి లేదు. వీటిని పెంచే వాళ్లు బుర్ర బద్దలుగొట్టుకున్నా ఏమీ అలవాటు చెయ్యలేరు. వయస్సు ముదిరి చచ్చిపోయిన ఉష్ట్రపక్షుల్ని నేనెన్నడూ చూడలేదు. అన్నీ తెలివితక్కువవల్ల ప్రమాదాలకు గురై చచ్చిపోతాయి. ఒకసారి ఒక నిప్పుకోడి చెట్టువద్ద నిలబడిఉంది. నేను ఊరికే ఉశ్ అన్నాను. వెంటనే బెదిరిపోయి ముందున్న చెట్టు చూసుకోకుండా ముందుకు తడబడింది. మెడ రెండు కొమ్మల మధ్య చిక్కుకుంది. అప్పుడైనా సవ్యంగా మెడ ఎత్తినట్లైతే బాగుండేది. కాని ఒక్క గుంజు గుంజింది. మెడ పుటుక్కుని విరిగిపోయింది.

నిప్పుకోడిమాంసం తినడానికి బాగుండదు. గుడ్లతో మాత్రం రుచికరమైన తినుబండారాలు తయారుచెయ్యవచ్చును. ఒక్క గుడ్డుని ఉడకబెట్టటానికి రెండు గంటలు పట్టుతుంది. ఒక్కొక్కటి పది పన్నెండు మందికి సరిపోతుంది.

ఉష్ట్రపక్షి సర్వభక్షి. ఆగొట్టంవంటి గొంతుకలోకి దిగగలిగితే చాలు ఏదైనా సరే మింగేస్తుంది. గడియారాలు, గాజుపెంకులు, బొత్తాములు, తాళంచెవులు, చెంచాలు, ఒకటేమిటి సమస్తవస్తువులూ ఆహారయోగ్యమైనవని భ్రమించిమింగేస్తుంది. ఒకసారి మా మేనత్త వచ్చింది. ఆమెకి కట్టుడుపళ్లున్నాయి. ఉదయమే ముఖం కడుక్కుంటూ పళ్లగుత్తి తీసి కిటికీలో పెట్టుకుంది. కిటికీఅవతలని లబడిఉన్న నిప్పుకోడి ఇదేదో తినేవస్తు వనుకొని కిటికీఊచలగుండా తల దూర్చి ఒక గుత్తిని కైంకర్యం చేసింది. ఆపైన మా అత్త ఒకటే గోల. గుత్తి ఇంకా కంఠంలో ఉండగా నెమ్మదిగా కిందికి దిగజారుతున్నప్పుడు చూసి దాని మెడ కోసి గుత్తి తియ్యమని ఆమె పట్టుబట్టింది. కాని దాన్ని చంపడానికి మా తాత ఒప్పుకోలేదు. కొద్దిరోజులు ఓపిక పట్టితే గుత్తిని గుత్తిపళ్లంగా విసర్జిస్తుందనీ చెక్కు చెదరకుండా మళ్ళీ తిరిగొస్తుందనీ మా తాత చెప్పాడు. మా అత్త చీదరించుకుని బోసినోటితో ఆరోజేతన ఊరికి ప్రయాణంకట్టేసింది.

ఉష్ట్రపక్షి కిద్దరు శత్రువు లున్నారు. నక్క, కోతి. తల్లిపక్షి అజాగ్రత్తలో ఉన్నప్పుడు గుడ్లదగ్గిరికి నక్క వెడుతుంది. ఒక గుడ్డుని ముట్టెతో గెంటుతూ గోతిఅంచుకి తీసుకెడుతుంది. అంచువద్ద గుడ్డుని నిలబెట్టి వెనక్కి తిరిగి వెనకకాళ్లతో బంతిలా తన్నుతుంది. అది మిగతా గుడ్లకి తగిలి పగిలేవరకూ అలాగే చేస్తుంది. పగిలినతరవాత కడుపు పట్టినంత తింటుంది. గుడ్డులోపల పిల్ల ఎదిగి ఉంటే నక్కకి మరీ ఇష్టం. నక్కలికి గుడ్లే కావాలి కాని ఎదిగిన పక్షుల్తో నిమిత్తంలేదు. కోతులూ అంతే. తల్లిపక్షి గుడ్లదగ్గిరున్నప్పుడు కోతి వచ్చి నానాహంగామా చేస్తుంది. చుట్టూ తిరిగి గంతులేస్తుంది. పక్షి అటూ ఇటూ తిరగలేక మెడనెప్పి పుట్టినప్పుడు గుడ్లని వొదిలేస్తుంది. అప్పుడు కోతులు గుడ్లు ఎత్తుకుపోయి తింటాయి.

ఉష్ట్రపక్షి పిల్లలకి నీళ్లు ఎలా తాగాలో నేర్పడానికి చాలాసేపు పట్టుతుంది. అవెల్లా తాగుతాయో ఆమాదిరిగా చేత్తో చేసి చూపితే, అవి అనుకరిస్తాయి.

గుడ్లు పొదిగినతరవాత పిల్లల్ని కాపాడ్డం ఒక ఎత్తు. తరుచు తల్లిపక్షులు కంగారుపడి తొక్కేస్తాయి. వాటిని నక్కలవాత పడకుండా కాపాడాలి.

ఈకలు కత్తిరించినప్పుడు నిప్పుకోళ్ల గుంపుల్ని చూస్తుంటే ఎంతైనా కాలక్షేపం. ఈకల్ని మనుషులు కత్తిరిస్తే, తన శోభ తరిగిపోడానికి కారకులు తోటి పక్షు లనుకుని ఆ పక్షి మిగతా పక్షులమీదికి కాళ్లతో తన్నుకుంటూ యుద్ధానికి వెడుతుంది. ఆ సమయంలో ధాన్యం చూపిస్తే చాలు దానికోపం చల్లారిపోతుంది.

కాని ప్రథమప్రపంచ సంగ్రామంతో ఉష్ట్రపక్షుల ఈకల విలువ పడిపోయింది. క్రమంగా ఫేషన్లు మారిపోయాయి. ఇప్పుడీ ఈకెలు కావాలనేవారు లేరు. ఉష్ట్రపక్షుల పెంపకం ఏనాడో మానేశారు.

[సాటర్డే ఈవెనింగ్ పోస్టునుంచి]

# ఊసుపోక విశాలాంధ్రం

ఆంధ్రుల ప్రతాపం ముమ్మూర్తులా విజృంభిస్తోంది. వీరాంధ్రులు ఆంధ్రావనిలో జైత్రయాత్ర సలిపి విశాలాంధ్ర కెగబడ్డారు. "హైదరాబాద్ చలో" "హైదరాబాద్ చలో" అంటూ పెద్దపెద్ద అంగల్తో విజయవాడనుంచి పల్నాటిసీమకీ, ఓరుగల్లుకోటకీ పయనమై వెళ్లి అక్కడ జండాలెత్తారు.

అయితే ఇక్కడ మన ఉపన్యాసాలు వినేవారు అట్టే మంది లేక కొత్తగడ్డలు నెలుకుతున్నారని ఎవరన్నా అనవచ్చు. కాని అటువంటిమాటలు మాకు వినిపించవు. కుక్కలు మొరిగితే ఏనుగులు ఆగిపోవు.

"ఏకారణంచేతనైనా ఆంధ్రరాష్ట్రం ఏర్పడకపోయినప్పటికీ విశాలాంధ్రతీర్మానం చెయ్యడం అత్యవసరం" అని జేగంట వాయించారు ఓరుగల్లువిశాలాంధ్రమహాసభాధ్యక్షులు శ్రీ కాళేశ్వరరావుగారు.

నెహ్రూ పటేల్ మొదలైన మహానాయకులు ఆంధ్రవీరుల ఈప్సితాన్ని మన్నించారు. రాష్ట్రం ఇవ్వలేదు. తీర్మానాల్ని మనకి మిగిల్చారు. "విశాలాంధ్ర మహాసభస్థాయీసంఘంవారు సమావేశం జరపడంలోనూ విశాలాంధ్రతీర్మానం చెయ్యడంలోనూ ధైర్యసాహసాలు ప్రదర్శించారు"అని కొనియాడారు ఆంధ్రకేసరి. విశాలాంధ్రవనసంతర్పణాలు, ఆంధ్రరాష్ట్ర రాజకీయభజనలు, వీరాంధ్ర తీర్మానాలతో ఆంధ్రశూరుల ఆకలి తీరుతోంది. సభలూ తీర్మానాలూ విరివిగా చెలరేగుతున్నంత కాలం ఆంధ్రోహానికి రాష్ట్రం అనవసరం. "అస లీలా రోజులు గడిచిపోతుంటే చాలు ననుకుంటున్నారు, రాష్ట్రం రాకపోతేనే చల్లగా ఉంటున్నారల్లే ఉంది" అని భక్తవత్సలంగారన్నారంటే అందులో అట్టే అబద్ధం లేదు. ఇంక విశాలాంధ్రస్థాపననే మొనగాడూ అడ్డగించలేరన్నారు విశాలాంధ్రమహాసభాధ్యక్షులు. సంస్థాపన ప్రమాదంలేని రాష్ట్రాన్ని పుట్టని, మొనగాడెవడూ అడ్డగించలేడని మనకి ఘంటాపథంగా తెలుసును. మన సవాలుకి తిరుగు లేదు.

కాంగ్రెస్ప్రముఖులు డా॥ పట్టాభిగారు విశాలాంధ్రాన్ని ఆశీర్వదించారు. విశాలాంధ్రాన్ని తల్చుకునేసరికి వారికి 1908 లో ఆంధ్రమహాసభ "అంకురార్పణ" జ్ఞప్తికి వచ్చింది. విశాలాంధ్రమహాసభకి పూర్వీకులు ఆంధ్రమహాసభ.ఆశీస్సులు. (నాలాగే నూరేళ్లు బతకమని నూతనవధువుకి పూర్వసువాసిని ఇచ్చిన దీవనమాత్రం కాస్సేపు మర్చిపోదాం.)

"హైదరాబాద్ను విడగొట్టి తెలంగాణాని చెన్నరాష్ట్రంలో చేర్చేస్తే చాలు అరవల రోగం దెబ్బకి కుదిరిపోతుంది. అప్పుడు ఆంధ్రరాష్ట్రంకోసం వాళ్లే మొర్రోమంటూ వస్తారు" అన్నారు శ్రీ కాళేశ్వరరావుగారు. సూక్ష్మంలో మోక్షం. పెంకి పాపాయికి ఉత్తుత్తి మిఠాయి.

"ఆంధ్రులంతా ఒక్కతాటిమీద నడిస్తే పక్షంరోజుల్లో వస్తుంది ఆంధ్రరాష్ట్రం" అని అరిటిపండొల్చి అరచేతిలో పెట్టారు శ్రీ ప్రకాశంగారు. నిజం. ఎవరి తాటిమీదో ముందుగా తేల్చగలిగితే రేపే ఊడిపడుతుంది ఆంధ్రరాష్ట్రం.

* * * *

## వెనక పడ్డవాళ్లు:

ఈమధ్య పత్రికల్లో ఎక్కడమాసినా "వెనకపడ్డవాళ్ల" గొడవే కనిపిస్తోంది. అమెరికాకంటె రష్యా వెనకపడ్డదేశం. యూరప్కంటె ఆసియా ఆఫ్రికాలు వెనకపడ్డ ఖండాలు. సర్కార్లకంటె రాయలసీమ వెనకపడ్డ ప్రాంతం. ఉత్తరాదికంటె దక్షిణాది వెనకపడ్డ ప్రాంతం. అరవలకంటె ఆంధ్రులు వెనకపడ్డవాళ్లు. బ్రాహ్మణుల

(37 వ పేజీ చూడుడు)



"అమెరికాలో పండిట్ నెహ్రూ" వార్తాచిత్రం నెహ్రూకు బహూకరించబడింది.

# కాంగ్రెస్ పునర్నిర్మాణం

శ్రీ సహజానందం

కాంగ్రెస్‌వారిలో సోమరితనం, అవినీతి, అధికారవ్యామోహం, పరస్పర ద్వేషం తీవ్రంగా వృద్ధిచెందుతున్నయ్. ఎన్నికల సమయంలో నిద్రాహారాలుకూడా మాని, ఊపిరాడకుండా 'జీపు'లు వేసుకొని తిరుగుతూఉంటారు. ఆ ఓపిక, చురుకు కొత్తగా చూసేవారికి ఆదర్శంగా ఉంటయ్. కాంగ్రెస్‌వారి స్వార్థత్యాగానికి ముగ్ధులవుతారు. ఓట్లరోజు తర్వాత ఆ, ఆ తాలూకా, జిల్లాకాంగ్రెసునాయకుల్లో కార్యసంఘసభ్యునినుంచి కార్యదర్శి, అధ్యక్షులవరకూ ఒక్కడూ కూడా మళ్లీ ఆ, ఆ పల్లెల ముఖాన్ని చూసిన పాపాన్ని (పుణ్యాన్ని!) పోరు. ఓట్లరోజుకు ముందు, "మీ ఊరిరోడ్డుమరమ్మతుకు వెంటనే ఆర్డరు వేయిస్తాము. హరిజనులకు నూతులు తవ్విస్తాం"అని ఎన్నోకబుర్లు చెప్తారు. తర్వాత ఉదాహరణకు మొన్నటిలా పెద్దతుపానుఏదైనా వచ్చినా, అక్కడ బీదాబిక్కీ ఎలా ఉన్నారో, వాళ్లకు ప్రభుత్వసహాయం ఎలా చేకూర్చాలో కాంగ్రెస్‌వారికేమీ పట్టదు. ఇదంతా చూస్తుంటే, సంక్రాంతిపండగకు వచ్చే 'మాయదొరలు' గుర్తుకు వస్తారు. అంటే పగటివేషగాళ్లు.

ఇలా సంస్థ నానాటికీ ప్రజలకు దూరమవుతోంది. కాంగ్రెసును మళ్లీ చైతన్యవంతం చేయాలని, సోమరితనం పోగొట్టి శక్తివంతం చెయ్యాలని పెద్దలు, పిన్నలు తర్జనభర్జన చేస్తున్నారు. కాని కుంభకర్ణునిలా ఉన్న కాంగ్రెసు వీరి మేల్కొలుపు పాటలకు చలిస్తున్నట్టు కనబడటంలేదు. అందరూ చెప్పేవారే అయినప్పుడు చేసేదెవరు ?

ఒకవేళ, సోమరులుకానివాళ్లు కొంతమంది కాంగ్రెసుపనికి పూనుకోవాలని తీవ్రంగా ప్రయత్నించినా, వారి ఉత్సాహసంకల్పాలు క్రియారూపంలో సక్రమంగా ప్రతిఫలించే అవకాశం ఉందాఅంటే, అదీ ఎక్కువగా కనబడటంల్లేదు.

అక్కడక్కడ గ్రామాల్లో, బస్తీల్లో కాంగ్రెస్ సంప్రదాయాన్ని మనస్ఫూర్తిగా అనుసరించాలనేవారు లేకపోలేదు. కాని కార్యరంగంలో అడుగుపెట్టగానే వీరికి అడుగు ముందు పడదు.

ఏమి చెయ్యాలో, ఎలా చెయ్యాలో స్పష్టంగా నిర్దేశించినవారెవరూ లేరు.

ఇంతకుపూర్వం ఖద్దరు ప్రచారం, రాట్నాలు ఏర్పాటుచేయటం, హరిజనోద్ధరణ, మద్యపాననిషేధం...వగైరా కార్యక్రమాలు ఉండేవి. ఈ కార్యక్రమాలు ఇప్పుడూ లేవనికాదు. కాని ప్రభుత్వాలేర్పడ్డాక, ఈ కార్యక్రమాలతో తమకు సంబంధం లేదని, వాటిభారం అంతా మంత్రులదే ననేభావం కాంగ్రెస్‌వారిలో పాతుకుపోయింది.

పరిపాలించేది మన ప్రభుత్వాలే అయినప్పుడు, ఇంకా మన కంఠశోష, కాలితీత ఎందుకు ? సర్వసామాన్యంగా ఇదే కాంగ్రెసువారి నిర్లిప్తతకు కారణం.

పరాయిప్రభుత్వం ఉన్న రోజుల్లో తాగుడుపాకలవద్ద నిలబడి సత్యాగ్రహులు, 'పికెటింగు' చేసేవారు. ప్రభుత్వమిప్పుడు మద్యపానాన్ని నిషేధించినా, చాటుమాటున అక్కడక్కడ తాగుడువ్యాపారం జరుగుతోంది. ఇది కాంగ్రెసువారికి తెలుసు. ఈ వ్యాపారాన్ని నిర్మూలించటానికిమటుకు పనిచేయరు. 'పోలీసువాళ్లున్నారుగదా, వాళ్లే చూస్తారు'అని క్రమేపీ గాంధీటోపీల సేవాత్యాగం స్థానే ఎర్రటోపీల ఆధిపత్యాన్ని పెంచుతున్నారు.

నిజంగా కాంగ్రెసువారు తలచుకుంటే, అక్రమమద్యపానాన్ని పోలీసు ఖర్చు, జులుంలేకుండా రద్దుచెయ్యటం అంత కష్టం కాదు.

కాంగ్రెసువారు ఈ పని చేయకపోవటంబట్టి, మద్యపాననిషేధం సక్రమంగా సఫలంకాకపోవటం, కాంగ్రెస్‌వ్యతిరేకులు ఇది ఆసరాగా చూసుకొని మద్యపాననిషేధాన్ని తీవ్రంగా ఖండించటం జరుగుతోంది.

ఇలాగే ఇతరకార్యక్రమాలు కుంటుపడుతున్నయ్

బట్టను విదేశాలకు ఎగుమతిచేయటం మన వ్యాపారానికవసరం. మిల్లుబట్టవాడుకను దేశంలో తగ్గించినకొద్దీ, ఎగుమతివ్యాపారానికి వీలు. పల్లెప్రాంతాల్లో జనాభాలో అత్యధికసంఖ్యాకులు సంవత్సరంలో ఎక్కువకాలం చేసే పనీపాట లేక, దారిద్ర్యంతో కృశిస్తున్నారు. ఈ రెండు కారణాలదృష్ట్యా ఖద్దరుకార్యక్రమం అత్యవసరం. కాని ఎక్కడా ఈ రోజుల్లో 'రాట్నసంగీత'మే వినబడుట్లేదు.

పారిశ్రామికవాదులను గాంధీజీశిష్యులమనుకొనేవారు ఖండిస్తారు. పారిశ్రామికవాదులూ దేశంలో నిరుద్యోగసమస్య ఇప్పడిప్పుడే పరిశ్రమలమూలంగా సమసిపోదు, కుటీరపరిశ్రమలు అవసరం అని చెప్తారు. కాని కుటీరపరిశ్రమలగురించి పనిచేసేవాడు లేడు.

ప్రతిగ్రామంలో సగటున పది రాట్నాలు పనిచేసినా, చాలు. కాని ఈ సంగతి ఎవరి మనస్సుకూ పట్టదు.

ఇలా పరిశీలించుకుపోతే, ఏ నిర్మాణ కార్యక్రమంలోనూ కాంగ్రెస్‌వారు పాల్గొనట్లేదని, రుజువవుతుంది. కాంగ్రెస్‌వారు ఏంచేస్తున్నారు మరి ?

శాసనసభల్లో, అధికారస్థానాల్లో సభ్యత్వాన్ని, పలుకుబడిని సంపాదించుకోటమే వారు చేస్తున్న పని.

ఈ అధ్వాన్నస్థితికి ప్రాంతీయ కాంగ్రెసువారి సోమరితనం, స్వార్థం ఇవే కారణాలు కావు.

అఖిలభారత కాంగ్రెసు నాయకులెక్కువగా భాగ్యవంతులు. వీరిలో ముఖ్యులు

మంత్రులవటంతో, వారికి సంస్థనుగురించి శ్రద్ధ తీసుకొనే సదవకాశం ఉండుట్లేదు.

నెహ్రూ ప్రధానమంత్రి అయాక గాంధీజీఅసలుశిష్యులే కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉంటూవచ్చారు.

మొదట ఆచార్య కృపాలనీ, తర్వాత రాజేంద్రప్రసాద్, ఇప్పుడు డాక్టరు పట్టాభి.

అయినప్పటికీ కాంగ్రెస్ చైతన్యవంతం కావట్లేదు. గాంధీజీసత్యాహింసలు, నిర్మాణకార్యక్రమం ఇవే మోక్షం అని చెప్పే ఈ ముఖ్యశిష్యులు వీటిని కాంగ్రెసు ఆచరించేట్టు చేయలేకపోతున్నారు.

అభిప్రాయభేదాలు వచ్చి కృపాలినీ రాజీనామా నిచ్చాడు. కాంగ్రెస్ప్రభుత్వ విధానాలను తీవ్రంగా ఖండించాడు ఖండిస్తున్నాడు.

తాత్కాలికంగా రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడయ్యాడు. తర్వాత డాక్టర్ పట్టాభి.

గాంధీజీకి భాష్యకారుడని ప్రసిద్ధి చెందిన ఈ అధ్యక్షుడు పీఠ మెక్కాక గాంధీజీ సిద్ధాంతాలు, నిర్మాణకార్యక్రమం కాంగ్రెసువారి కార్యప్రణాళిక కాగలవని కొంద రాశించారు.

కాని కాంగ్రెసులో మార్పేమీ కనబడలేదు. కనబడట్లేదు. కనబడే సూచనలు కానరావు.

ఎక్కడ ఉన్నావే గొంగళీ అంటె వేసినచోటే ఉన్నానంటోంది కాంగ్రెసు.

కాబట్టి అగ్రనాయకుల్లో కూడా చైతన్యం, కార్యాసక్తి కనబడట్లేదు.

ఈ అయోమయావస్థకు కారణమేమిటి? ఇందుగురించే ముఖ్యంగా విచారించాలి.

ఒక ముఖ్యకారణం ఇది: కాంగ్రెస్ ఇంతవరకూ చెప్పినదానికి, ఇప్పుడు ప్రభుత్వాధికారంపొంది చేస్తున్నదానికి సంబంధం కనబడట్లేదు.

మంత్రులై కాంగ్రెస్వా రవలంబిస్తున్న విధానాలను కాంగ్రెస్వారు విమర్శించాలి. ఇది శిక్షణకు విరుద్ధం. లేదా సమర్థించాలి. తమ పాతవ్యవహారందృష్ట్యా సమర్థించటం తృప్తిగా ఉండదు. కాబట్టి ముక్కు మూసుకొని కూర్చోటమే మర్యాదగా పాటిస్తున్నారు-మంత్రులుకాని కాంగ్రెసువారు.

మద్యపాననిషేధం తక్షణం సర్వత్ర అమలుజరగాలని కాంగ్రెసుఆదేశం. కాని మెల్లగా, ప్రభుత్వఆదాయాలకు దెబ్బ తగలకుండా జరగాలంటారు కాంగ్రెస్ మంత్రులు. గుర్రపుపందాలు రద్దుచేయవద్దు అంటారు మంత్రులు. గుర్రాలను పెంచటానికి పందాలే అవసరమైనట్టు.

అలాగే ఖద్దరువిధానం. ఇందువల్ల అత్యధికసంఖ్యాకులైన పల్లెనిరుద్యోగులు ఆర్థికంగా, నైతికంగా అభివృద్ధి చెందుతారని కాంగ్రెసుసందేశం. కాని ప్రభుత్వాలు మిల్లులకు, చేనేతవాళ్లకు ఒనగూర్చుతున్న సదుపాయాలదృష్ట్యా, ఖద్దరువిధానానికి ఇస్తున్న సాయం అత్యల్పం.

### ఆర్థికవిధానం :

1947 డిసెంబరులో కాంగ్రెసు ఇందుగురించి ఒక ఉపసంఘాన్ని నియమించింది. దాని కధ్యక్షుడు నెహ్రూయే. ఆ సంఘ సూచనలు పత్రికల్లో ప్రకటితం కాగానే పారిశ్రామికులు, పెట్టుబడిదార్లు గోల చేశారు. చివరకు ఆ సంఘాధ్యక్షుడైన నెహ్రూయే పార్లమెంటులో ప్రధానమంత్రిగా పెట్టుబడిదార్లకు హామీఇచ్చాడు. "అవి కాంగ్రెస్సూచనలు, వీలునుబట్టి ప్రభుత్వం ఆచరిస్తుంది" అని. ఆ సంఘ సూచనలకు, ప్రభుత్వవిధానాలకు చాలా వ్యత్యాసం ఉంది.

### కార్మిక విధానం :

కాంగ్రెసుకు అనుబద్ధమైన జాతీయ ట్రేడుయూనియనునాయకులకు గాంధీజీ సిద్ధాంతాలు, ఆదర్శాలు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు చెప్పేదానికంటే మేంచెప్పేదే ఎక్కువ అభివృద్ధిదాయకంగా ఉంటుంది. కనీసజీతం రు 100 లు. గరిష్ఠజీతం రు 120 లు అన్నాం. ఏదేశంలోకూడా ఆదాయ వ్యత్యాసాలు ఈ ప్రమాణంలో లేవు. మా సూచనలప్రకారం ఆర్థిక అసమానత్వం చాలావరకు, రష్యాలోకంటెకూడా తగ్గిపోతుంది అంటారు. కార్మికులను కంపెనీల్లో మిగతావాటాదార్లతో సమానమైన వాటాదార్లుగా పరిగణించాలి, కంపెనీ పుస్తకాలను వారిని పరిశీలించనివ్వాలి అని గాంధీజీ అన్నారు. పెట్టుబడిదార్ల సామాన్య జీవనభృతికి సరిపడఉంచుకొని మిగతాది పరిశ్రమ అభివృద్ధికి, కార్మికుల శ్రేయస్సుకు వినియోగించాలని పలుసార్లు చెప్పాడు. తమ ఆస్తిపాస్తులకు యజమానులుగా కాక, ధర్మకర్తలగా ఉండాలని 'ఉన్నవారికి' బోధించాడు. కాని ఈనాడు వీటిని ఆచరణలో పెట్టటానికి అవకాశం, అధికారం ఉన్న కాంగ్రెసువారు సభావేదికలపైనుంచు, ఇప్పటివాళ్ళు, కొందరు సంధ్యావందనం చేస్తున్నట్టే, గాంధీజీసిద్ధాంతాలను ఊరికే జపిస్తూ ఉంటారు.

ఈమధ్య పార్లమెంటులో జాతీయ

(32 వ పేజీ చూడుడు)



పిలనీ ఇంజనీరింగ్ కళాశాల కర్మాగారంలో.
ఒక యంత్రాన్ని పరిశీలించుచున్న ప్రధాని నెహ్రూ




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౧౯

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాస్త్రం తతో జయ ముదీరయేత్."

శ్రీమహాభారతమ్.

తిక్కనసోమయాజులు అన్నమంత్రీశ్వరుల యింటి కతిథిగా వచ్చియుండెనుగదా! ఆయన యిన్నాళ్లు నేమి చేయుచున్నాడు? ఎక్కడ నున్నాడు? గురునాథు డేమయ్యెను? మారన కెట్లు ప్రొద్దుపోవుచున్నది?

తిక్కనసోమయాజులు తమ సోమిదేవమ్మతో కలసియే ఏకశిలానగరము వచ్చినారు. లేకున్న త్రేతాగ్నులు సాగు టెట్లు? అన్నమంత్రీశ్వరుని భవనమున వారి కొక శాల ప్రత్యేకింపబడి అది సర్వసంపన్నముగా సమర్పబడినది. అందనేకభాగములు గలవు. వానియందన్నిట నగ్నిహోత్రగృహము పవిత్రమనోజ్ఞము!

ఆమధ్య కొంతకాలము సోమయాజుల మహాభారతాంధ్రీకరణ మాగిపోయినది. నెల్లూర మహాయుద్ధము చెలరేగుచుండగా ఆ పెన్నానదీతీరమునందలి మండపముపై గూర్చుండి శాంతముగా నాయన రచన సాగించుకొన సాధ్యమగునా? ఒకప్రక్కను వీరభటుల యలజడి రణభేరీభాంకారములు. ఆ శబ్దము లెన్ని చెవుల జొచ్చుచున్నను కొంతవరకు నిర్లిప్తుడై యుండగలుగునేమో కాని, మధ్య మధ్య దీనుల యార్తారవములు విని సోమయాజులు భరించగలరా? అవి చెవులలో పడినంతనే దేహమంతటను విద్యుద్వేగమున ప్రసరించును. కవిత్వ మాపై నెట్లు సాగును? అందుచే రచన ఆగిపోయినది.

అంతలో ఆయన నెల్లూరుపట్టణమే విడువవలసి వచ్చినది. ఆ పినాకినీనదీపవిత్రవారిలో క్రుంకు లాడుటే దూరము కావలసి వచ్చినది. మనుమగండగోపాలునిపై నున్న వాత్సల్యముతో నాతనికి సహాయ మర్థించుటకు ఓరుగల్లుకు కరణములతో ప్రయాణము కావలసివచ్చినది. ఆ పిమ్మట కొద్దికాలమునకే మనుమసిద్ధి నెల్లూరుపట్టణమును పాండ్యపల్లవసేనలకు వదలివేసి దేశాంతరగతు డయెనను వార్తలు సోమయాజులకు తెలిసెను. అయినను ఓరుగంటికి ప్రయాణ మాతడు ఆపక సాగించెను. అక్కడ అవకాశము చిక్కినంతనే తనతో పరివారముగా వచ్చిన కరణములను అక్కడి ప్రభువులకు ఉపయోగపడునట్లు చేసియుండెను గదా! సమయము వచ్చినప్పుడు మనుమసిద్ధి ఎక్కడ నున్నది యెరిగి చేతనైన యుపకార మాతనికి చేయింపవచ్చును. అంతవరకు నిచ్చట శాంతముగా మహాభారతాంధ్రీకరణము సాగింపవచ్చును. కాని ఎక్కడ గూర్చుండి వ్రాయుట?

అగ్నిహోత్రశాలలో గూర్చుండి యది సాగింపవచ్చునని ముందు సోమయాజు లూహించెను. అగ్నిహోత్రునిలో సమస్తదేవతలను ప్రత్యక్షము చేసికొనవచ్చునుగదా! హరిహరనాథుడు మాత్ర మందు ఏల సన్నిహితుడు కాడు? నిజమే! అయినను ఆశ్వయుజ శుద్ధఅష్టమినాడు సోమయాజులు స్వయంభూదేవుల దర్శించుట కాలయమున కేగెను. ఆ యాలయావరణముననే శ్రీ కేశవాలయ మున్నది. ఆ విశాల మగు ప్రాకారమున కంటి యెన్నియేని మనోహరమండపము లున్నవి. ప్రక్కనే స్వయంభూదేవుని సరోవర మున్నది. అక్కడనే ఎదురుగా హరిహరనాథు లేకమైన మూర్తివలె ఏకశిలబొడ్డురాయి భాసించుచు సమీపమున గనుపించుచుండును. తుదకు స్వయంభూదేవాలయప్రాంగణమున గల యొక మండపమున గూర్చుండి విజయదశమినాటినుండి శ్రీమహాభారతరచన మరల సాగింపనాయన నిశ్చయించెను. సిద్ధసంకల్పులకు విఘ్నము లుండునా? అట్లే సాగుచున్నది.

తిక్కనసోమయాజులు ఉదయమున సంధ్యావందనాగ్నిహోత్రాదికము నిర్వర్తించుకొని కుశపాణియై తనవెంట గురునాథుడును మారనయు కోశాదికములతో రా పాదచారియై స్వయంభూనికేతనమునకు బయలుదేరి యందు నిరృతిదిక్కున గల మహామండపమున ప్రాచీముఖముగా కూర్చుండి రచన కుపక్రమించును. సమీపమున గురునాథుడు ఉత్తరమునకు తిరిగి యాసీనుడై వ్రాయుచుండును. ఆతనిప్రక్కనే మారన కూర్చుండి ఎదురుగా వ్యాసపీఠమునం దుంచి శ్రీమహాభారతమూలము పఠించుచుండును. అట్లు వారు కూర్చుండుటచే వారికి కేశవ శ్రీస్వయంభూనికేతనములు ఎదురుగా నుండును. ఆ రెండుదేవాలయముల శిఖరములు హరిహరనాథుని రెండు మూర్తులుగను ఆవల నున్న ఒంటిమిట్ట—ఓరుగల్లు, ఏకశిల—ఆ రెండుమూర్తులు నొకటైన రూపముగను అక్కడ నుండువారికి పొడగట్టును!

ప్రాతఃకాలమున నచ్చటికి వచ్చి మాధ్యాహ్నికములకు వేళ యగువరకు శ్రీమహాభారతరచనము నచ్చట సాగించి యంతట। తిరిగి

భవనమునకేగి మాధ్యాహ్నికములు నిర్వర్తించి భోజనానంతరము సోమయాజులు కొంచెము విశ్రమింతురు. మరల నంతట దేవాలయ ప్రాకారమున గల మండపమునకు ప్రొద్దుటివలెనె వచ్చి సంధ్యా కాల మగువరకు వారు రచన కావింతురు.

ఈనా డుదయమున ఆనుశాసనికపర్వమున పంచమాశ్వాసము ప్రారంభింప నుండెను. మండపమున నాసీను డైన యనంతరము సోమయాజి కొంచెముతడవు ధ్యానమగ్ను డై యుండి పిమ్మట నిట్లు పలికెను.

'శ్రీకాళీత్వాదరసుశ్లోకాలోకనవిలాసనుస్థిరభవ నా
శోకముదాద్యవధూతి వ్యాకోశవివేకభవన హరిహరనాథా !'

అట్లు సోమయాజి చెప్పుచుండ నది శ్రద్ధగా చెవియొగ్గి చక్కగా ధారణ చేయుచు గురునాథుడు తాళపత్రముపై గంటము లోని రత్నములు గణగణ లాడుచు శ్రావ్యనాదము చేయుచుండ లిఖించెను. అంతట సోమయాజులు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యా సకృతమహాభారతకోశపూజ నిర్వర్తించి—

'నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాస్తతో జయ ముదీరయేత్.'

అనుచు నరనారాయణులను సరస్వతిని వ్యాసవాణితో ధ్యానించెను. గురునాథుడును మారనయు సోమయాజుల ననుసరించిరి.

అంతట మారన వ్యాసమహాభారతకోశబంధము సడలించి పత్రములు వ్యాసపీఠమున రెండుచేతులతో విస్తరించి కావలసిన పత్రము దాని కున్న సూత్రముతోడనే పైకి తీసి కన్నుల కద్దుకొని పాఠము ప్రారంభించెను. ఆ కంఠమున నెంత మాధుర్యము! ఎంత శాంతము! ఎంత గాంభీర్యము! ఎంత మాధ్యము! బ్రహ్మతేజో నిధి యగు శుకయోగియే యీ రూపమున నవతరించి పఠించుచున్నాడా యనిపించును. సోమయాజి తదేకచిత్తుడై యాలకించుచు కొంతవడికి ఆపుమన్నట్లు మారనకు సంజ్ఞ చేసెను.

ఆపై కొంతతడవు సోమయాజులు మౌనము వహించెను. అందరును మౌనమే! విన్నయాభాగమును తిక్కన మననచేయుచుండెను. ఆ శ్లోకముల యర్థము ముందు ఆయనహృదయములో సుస్థిర మయ్యెను. సుస్థిరమైన యా యర్థ మాతడు మరల మరల నవలోడన మొనర్చెను; మరల మరల మథించెను. ఆ మథనముతో నగ్ని పుట్టెనో యేమో! గాని, కొంతతడవున కా యర్థము సోమయాజుల హృదయములో కరగిపోయి రసస్వరూప మందెను. సువర్ణకటక మొకటి మూసలో నుంచి దానిని కుంపటిలో పెట్టి అగ్ని ప్రజ్వలింపజేయగా ద్రవీభూతమై యా సువర్ణకటకము కేవలసువర్ణాకృతి నొందు విధముననే వేదవ్యాసార్థము తిక్కనసోమయాజుల యంతరంగ మను మూసలో వేడెక్కి కరగిపోయి స్వచ్ఛసువర్ణాకారమై యొకానొక సామ్యావస్థ నందెను. ఆ స్థితిలో సువర్ణము స్వర్ణకారుని ఇచ్ఛచొప్పున నే యాకారము పొందుటకైనను అనువుగా నుండునుగదా! అట్లే ఆయర్థమును కొంతతడవునకు సోమయాజుల ఇచ్ఛాశక్తిచే సత్త్వ ముద్రేకించి ఆంధ్రవాణీరూపముగా నది యాయనజిహ్వాగ్రమునుండి యుద్గమించెను. సోమయాజుల యమృతవాక్కు ఎప్పుడు బయలువెడలునా యను నుత్కంఠతో ఆ మహాత్ముని పెదవులవంక నేకాగ్రదృష్టితో నంతవరకు జూచుచున్న గురునాథు డొక్కుమ్మడి జాగృతు డయ్యెను. సోమయాజుల వాక్కు లిట్లు వెడలినవి.

'దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె !'

ఈవచనముతోడనే ప్రతియాశ్వాసమును తిక్కనసోమయాజి ప్రారంభించును. కాని తిక్కననోట నాశబ్దము లుచ్చరింపబడుచుండగా వినుచున్న గురునాథునకును మారనకును ఆ ఐదుశబ్దములును పంచభూతాత్మక మగు సృష్టిగానే భాసించును. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి యగ్ని, అగ్నినుండి యప్పులు, అప్పుల నుండి పృథివి!

దేవా, యని హరిహరనాథుని సంబోధించి పలుకుచున్న సోమయాజుల వాక్కు విన్నవారే ధన్యులు! రామాది భగవన్నామములే విస్తరించి గానముచేయువా రెందరు లేరు? అట్లే ఆ శబ్దమును సోమయాజులును అనేకభంగుల నుచ్చరించును. ఒక్కొక్కమారొక్కొక్కభంగిగా నది వచ్చును. ద్యోతనస్వభావము వ్యక్తీకరించు దేవశబ్దమే సోమయాజుల హృదయములో నిత్యస్ఫూర్తితో వెలుగుచు లీనమై ఆయన కభిమానపాత్ర మయ్యెను.

అంతట నా మిగిలిన నాలుగుశబ్దములలో ముందు వైశంపాయనుని నామమే యాతడు స్మరించును. గతానుగతికముగా చదువుకొనువారికి ఆశబ్దము ఇతరపురుషుల నామములవలెనే ఒకానొక సంకేతమే కాని వైశంపాయనశబ్దము తక్కినసోమయాజులకు పూర్వకాలమున నున్న యొకానొక మానవుని నిర్దేశించు సంకేత మగు నామము కాదు. వైశంపాయనుడు ద్వాపరాంతమున యజుశ్శాఖలు లోకమున ప్రవర్తింపజేసిన వ్యాసశిష్యు డగు నొక మహర్షి! తానును యజుశ్శాఖలం దొకానొక డగు కృష్ణయజుశ్శాఖాధ్యాయి. వైశంపాయననామము స్మరించినంతనే తిక్కనసోమయాజుల హృదయములో యజుర్వేదము సాంగముగా భాసించును.

ఆపిమ్మట నాతడు జనమేజయనామ ముచ్చరించును. ఆతడు కలియుగ మవతరించినపిమ్మట భరతసార్వభౌములలో రెండవవాడు. వేదవ్యాసు డీ మహాభారతకథ నేల కథన మొనర్చెను? కలియుగములో, ముఖ్యముగా సార్వభౌములు, దీని నాకర్ణించి భారత ధర్మము రక్షించుచు జయము పొందుచుండవలె నను మహాశయముతో నాతడు దీనిని చెప్పినాడు. అందుకే దీని కాతడు జయ కావ్య మని పేరుపెట్టినది! ఈ మహాగ్రంథము ప్రథమోపదేశము జనమేజయచక్రవర్తికే వ్యాసుడు చేయించినాడు!

ఈ యూహాపరంపరలతో 'జనమేజయునకు' అనునప్పటికి సోమయాజుల హృదయములో తీవ్ర మగు బాధ యంకురించును. ఆ జయమునే నన్నయభట్టారకులు తెలుగువాణిలో రాజరాజునకు ఉపదేశింప ప్రారంభించెను గాని యది సాంతము చేయలేకపోయెనే! నే నుపదేశింప ప్రారంభింత మన్నను ఇప్పుడు ఆ రాజరాజైన లేడే! అయ్యో, రాజరాజు లేడే, యని హరిహరనాథునకు నివేదించుకొనును. తిక్కనకన్నులలో నీరు క్రమ్ముచున్నట్లై గిర్రున తిరుగుచున్నట్లే యుండ 'ఇట్లు' అను పదము గద్గదస్వరమున వచ్చును.

ఆ పిమ్మట 'అనియె' అను పదము నిట్టూర్పు విడిచినట్లే ఆయననోట వెలువడెను!

ఆ యైదుపదములు విన్న గురునాథునకును మారనకును

(27 వ పేజీచూడుడు)



కథాగేయం:

# బాపూజీ బాష్పాలు

(గాంధిజీ నౌఖాలీయాత్రలో ఒక ఘట్టం ఆధారం)

"అమరేంద్ర"



మతాలపేరిట మచ్చరాలతో మంటలు రేగినవీ
మంటలలోనా మానవత్వమే మసియైపోయిందీ
మంటలో పడీ మన భవితవ్యం మాడిపోయినాదీ
మంట నంటినా జాతిగౌరవం మంటకలిసినాదీ
మింటి వేలుపే తనకు తోడనీ ఒంటిగాను బాపూ
మారణహోమం భగభగరగిలే దారుణసీమలకూ
పాదచారియై చేతికర్రతో బయలుదేరినాడూ
కరుణ నిండినా జాలిగుండెతో కదలి వెళ్లినాడూ
నరకజ్వాలల నౌఖాలీకి తరలివెళ్ళినాడూ
మింటిదైవమే ఒంటి బాపుజీవెంట నడిచినాడూ.
సత్యకాంతితో ప్రేమశాంతితో
చేతికర్రతో చిరుతనవ్వుతో
కారుచిచ్చులా నౌఖాలీకి కదలివెళ్ళినాడూ.
కరుణకాంతులే వాడవాడలా మెరిసిపోయినాయీ
పల్లెపల్లెలా ప్రేమవాసనలు పాకిపోయినాయీ
తల్లిలేని పసికూనల జూసీ తల్లడిల్లినాడూ
పిల్లల బాసిన తల్లిదండ్రులా కళ్లుతుడిచినాడూ
పెల్లున పొంగే శోకమంత తన హృదిని దాచినాడూ
పెదవులమీదా మందహాసమును వదలలేదు బాపూ.
విసుగు వేసటలు లేకుండానూ విశ్వజ్యోతి బాపూ
తిరిగితిరిగి ఒక చిన్న పల్లెకూ, చేరుకొనియెనండీ.
పల్లెఅంతయూ వల్లకాడుగా మారిపోయినాదీ
పల్లెఅంతయూ పీనుగు పెంటల మురిగిపోయినాదీ
కాలిపోయినా కొంపలు, చూసీ కరిగిపోయినాడూ
కూలిపోయినా గుడిసెలు చూసి కుమిలిపోయినాడూ
జాలిగుండెలా బాపుజి చూసీ చాల కుంగినాడూ
అడుగులు తడబడ గుడిసెగుడిసెకూ నడిచివెళ్ళినాడూ
అడుగుఅడుగునా కళేబరాలే అడ్డుతగిలినాయీ
అడుగుఅడుగునా బూడిదపోగులె కానవచ్చినాయీ
తిరిగితిరిగి ఒక కాలిన గుడిసెకు చేరినాడు బాపూ
కాలిపోయినా గుడిసె నేలపై కూలిపోయినాదీ
కుమిలిపోయినా శవాల కంపూ గుప్పున కొట్టిందీ
అడుగు సాగకా బాపు అక్కడే ఆగిపోయినాడూ
చూడలేక ఆ ఘోరదృశ్యమూ హడలిపోయినాడూ
కూలిపోయినా కప్పుకింద పడి
కాలిపోయినా బాలకు డొకడూ
పలకా బలపం చేతపట్టుకుని
అమితశ్రద్ధగా అక్షరాలనూ
దిద్దుతుండగా పెద్దపెట్టునా
కారుచిచ్చులూ రేగి బాలకుని కాల్చివేసినాయీ
కూరుచున్నపాళాన బాలుడూ కుమిలిపోయినాడూ
కళ్ళు గిర్రునా తిరిగి బాపుజీ కాళ్ళు వొణికినాయీ
జల్లువానలా కళ్లవెంబడీ నీళ్ళు చిందినాయీ
బాలుని శవమూ బాపుకళ్లకూ
భారతదేశపు భవిష్యత్తులా
కానవచ్చి కంపించిపోయినాడూ
అభమూ శుభమూ ఎరుగని బాలుని
కబళించేసిన మతపిశాచమే
మతి తప్పించీ మత్తెక్కించీ
మనిషిని మనిషీ కుత్తుక నరికి
నెత్తురువరదలు పరుగిడుతుంటే,
కాలిపోయినా బాలుని రూపం
కూలిపోయినా జాతిగౌరవం
చూడలేకనూ బాపుగుండెలూ ఝల్లుమన్నవండీ.
పాతికేళ్లుగా తాను చేసినా తపసు వ్యర్థమేనా ?
జాతిజనులు తన మాటలన్ని పెడచెవిని బెట్టినారా ?
తన అహింసనూ శాంతికాంతినీ అనుసరించలేరా ?
తాను చెప్పినా సూక్తులన్నిటిని తన్నివేసినారా ?
"అన్ని మతాలకు అర్థమొకటనీ ఎన్ని చెప్పినానూ ?"
"అన్ని దారులకు గమ్యమొక్కటని ఎన్ని చెప్పినాను ?"
"అహింస అంటూ ఎంత అరిచినా అరణ్యరోదనమా ?
"అసురలోకమున శాంతిమంత్రములు అడివివెన్నెలేనా ?"
"ఎందుకింక నా బతుకు ఎందుకిక ఇంతటితో నేనూ"
"వెళ్లిపోదు నిక చూడజాల నీకళ్ళతోను నేనూ"
జల్లువానలా బాపుకళ్ళలో నీళ్లుదొర్లినాయీ
క్షణముసేపు ఆ జ్యోతికి చుట్టూ కమ్మెను చీకట్లూ
నూటయిరువదీ యేళ్ళు వలదనీ కుమిలినాడు బాపూ
మరుక్షణంలో బాపును కమ్మిన చీకటి చెదిరిందీ
కళ్లు తుడుచుకుని బాపు మెల్లగా కదలివెళ్లినాడూ
పిల్లలు పోయిన తల్లిదండ్రులా కళ్ళుతుడిచినాడూ
తల్లిదండ్రులూ లేని పిల్లలా చల్లని మాటలతో
ఊరడించుతూ లోని శోకమును
పెదవులమీదీ మందహాసమున
దాచుకొంచునూ తరలివెళ్ళినాడూ
శోకలోకమున అశోకయుగమును నిలుపుగాను బాపూ
చేతికర్రతో చిరుతనవ్వుతో సాగిపోయినాడూ
కాని బాపుజీగుండెలలోనా
కాలిపోయినా బాలుని శవమూ
కూలిపోయినా జాతిచరితగా
జాలిని గొలిపే దీనగాథగా
ఝల్లనిపించే ఘోరబాధగా
నిలిచిపోయి మన బాపుగుండెలూ కలతపెట్టినాదీ
కలతజెందినా బాపుమనసులో నిలిచిపోయినాదీ



# "కామీస్వతాంపశ్యతి"

(కథానిక)

శ్రీ యస్. గంగాధరం

తన హృదయ ప్రతిబింబాన్నే కళ్లెదుట చూస్తూంటాడు లోకంలో సామాన్య వ్యక్తి. హృదయం దుఃఖభారంతో క్రుంగి పోతూన్నప్పుడు, తన కన్నీళ్ళకళ్ళల్లోంచి జిల జిలగా కనిపిస్తూన్న ప్రపంచం తనలాగే కళ వళపడుతున్నట్టనిపిస్తుంది. హృదయాహ్లాదకరమైన దృశ్యాల్లో అగ్నిజ్వాలలు చూస్తాడాసమయంలో. మరుక్షణం తన హృదయం ఆనందసాగరంలోకి పారినప్పుడు, ఆనందాశ్రువుల్లోంచి ప్రపంచాన్ని అపరస్వర్గమని తలపోస్తాడు. బీదలగోల, దుఃఖితుల వేదన అతని చెవులకు వినిపించవు. ఇలాగే కౌమారుడు గూడా తన హృదయాన్నే ఎదటి స్త్రీవ్యక్తిలో చూస్తుంటాడు. ఆమె సహజమైన చేష్టలకి స్వంత అర్థాలు కల్పించుకుంటాడు. వాస్తవాన్ని గుర్తించటం సామాన్యవ్యక్తికి అసాధ్యం. దాన్ని గుర్తించకుండా తియ్యని తలపుల్ని చప్పరించుకుంటూ సరాసరి ఆకాశానికి ఎక్కిపోతాడు. వాస్తవం తేటపడినప్పుడు జారిపోతూన్న గుండెల్ని అదిమి పట్టుకొని నిరాశతో అక్కణ్ణుంచి క్రిందపడ్డాడు. తన మనస్సును ఆకర్షించినదానిమీద వెంటనే ముగ్ధుడై పోతాడు. వెనకముందు ఆలోచించకుండా. క్షణంలోనే మమత ఏర్పడిపోతుంది. మమతను అరిషడ్వర్గాలు చక్కగా అలంకరిస్తాయి. లేనిదుఃఖాన్ని తెచ్చిపెట్టుకొని పిచ్చివాడైపోతాడు. అంత్యదశనాశనం ప్రాప్తించే లోపల అదృష్టం ఉంటే కళ్లు తెరచుకుంటాడు, లేదా అగ్నిగుండంలోకే......!

* * *

సాయంకాలమౌతోంది. కారుచీకట్లు క్షణం పాటు సంధ్యారాగాన్ని తమలో జీర్ణం చేసేసుకున్నాయి. వెంటనే పూర్ణచంద్రుని లాలిమ, వాటిని రూపుమాపి, తన రజోగుణాన్ని ప్రకృతికాంతపటానికి అద్దింది. రెప్పపాటులో పాలవెన్నెల పొంగింది. సమయం ప్రకృతికాంతను రకరకాలుగా సింగారించి మనస్సును, తృప్తిపెట్టుకుంటుంది. నేను ముందుగానే స్టేషనుకు పోయి, బెంచిమీద తువాలు పరిచి నడుము చేరవేసి చంద్రుని వంక అట్టే చూస్తూ ఆలోచిస్తూన్నా. ప్రక్కతోపులోంచి ప్రకృతికాంత పరిమళయుతంగా చల్లని శ్వాసను విడుస్తోంది. ఆలోచన్లకు నా మెదడు అలసిపోయింది. తెలియకుండానే కళ్లు మూసుకుపోయాయి. మళ్లాకళ్లుతెరచేటప్పటికి స్టేషనంతా, నిర్జీవంగా పడివుంది. ఎక్కడివాళ్లక్కడ దీపాలు తగ్గించేసి గురకలు తీస్తున్నారు. నేను చంద్రుడు, యిద్దరమే ప్రకృతిలో మేల్కొనిఉన్నట్టనిపించింది.

కాసేపటికి దీపాలన్నీ ఎత్తారు. టిక్కట్టు తీసుకొని ప్లాటుఫారంమీద యిటూ అటూ

తిరుగుతూ సిగరెట్టు వెలిగించాను. యింతలో రైలు నిశ్శబ్దంగా వచ్చేసింది. ఎదటనే చిన్న కంపార్టుమెంటు ఖాళీగా ఉంది. గబగబా ఎక్కిపోయాను. అంతవరకున్న ఇద్దరు ప్రయాణీకులూ ఆస్టేషనులోనే దిగిపోయారు. రెండే సీట్లు ఉన్నాయి. ఒకదాని మీద పరుపు పరిచేసి కిటికీలోంచి బయటకు చూస్తున్నాను. గార్డు లైటు చూపిస్తున్నాడు. బండి కదిలేందుకు సిద్ధంగా ఉంది. ఇంతలో తలుపు దగ్గర శబ్దం అయింది. తలుపు తెరుస్తూ ఓమనిషి ఇద్దరు ఆడవాళ్లను గబగబ ఎక్కిస్తూ నన్ను కేకవేసాడు. నేను వెళ్ళి సామాన్లన్నీ అందుకొని సాయం చేసాను. క్షమించండంటూ నన్ను బ్రతిమాలుకున్నాడు. "నేను యింతమాత్రానికే!" అంటూ సమాధానం యిచ్చాను.

బండి నడుస్తోంది. ఆ మగమనిషి యిద్దరి ఆడవాళ్లను ఒకసీటుమీద కూర్చోబెట్టి, తాను పైబల్లమీద పరుపు విప్పి నిద్రతీయడానికి ఎక్కిపోయాడు. నేను పడుకుందామనుకున్నాగాని ఎదురుగా ఇద్దరు ఆడవాళ్లు. పడుకోడానికి సంకోచించి బయటికి చూస్తూ కూర్చున్నాను. కొండల్ని ఆనుకుని పోతోంది బండి. కొండలోయల గుండా కాలవల్లోంచి సందడి లేకుండా గంగపారుతుంది. ఇంద్రుడు తన అందాన్ని అగంగలో చూచుకుంటున్నాడు? అతని చల్లని కిరణాలు కిటికీలోంచి లోపలికి ప్రవేశిస్తున్నాయి. ఇంతలో కాలి కేదో తగిలినట్లయింది. త్రుళ్ళిపడి లోపలికి చూచాను. ఒక ఆమె అప్పుడే పడుకొంటోంది. తల నెరిసింది. జబ్బుగా మాల్సా, దగ్గుతూంది. రెండో ఆమె మొహంలో చూడంతోటే నాశరీరంలో ఓ అలజడి బయలుదేరింది అకస్మాత్తుగా? ఎఱ్ఱని పెదాలమీద చిఱునవ్వు కాంతులు, కంటిరెప్పలు టపటప లాడుతున్నాయి! కళ్లు మెరుస్తున్నాయి! ఆమె ముగ్ధచేష్టలు ఆమె యవ్వనాన్ని పరిచయం చేస్తున్నాయి. మొదట్లో ఆ పెద్దామె పడుకోవడంలో కాళ్లు రాసుకొని ఉండొచ్చనుకున్నాను. మరుక్షణంలో అది కాదనిపించింది. ఆమె చిరునవ్వుకు బదులుగా నేను కళ్లతో కృతజ్ఞతను తెలుపుతూ మందహాసం చేశాను. ఇద్దరికళ్లూ సిగ్గుతో క్రిందికి మరలిపోయాయి, మళ్ళా కలుసుకున్నాయి. ఈసారి నాహృదయంలో ఆనందతరంగాలు చెలరేగాయి. కిటికీలోంచి బయటికి చూస్తూ, నవ్వును దాచుకున్నాను. నాకళ్లకు బయటి దృశ్యాలు, చంద్రుడు, ఏదీ కనిపించడం లేదు. ఆసుందరవదనమే కళ్ళెదుట గిర్రున తిరుగుతోంది. లోపలికి తిరిగి చూడటానికి బలం లేకపోయింది.

రెండుక్షణాలు గడిచాయి. మళ్ళా చూసేటప్పటికి ఆయువతి మొహాన్ని పక్కకు తిప్పుకొని కిటికీలోంచి బయటకు చూస్తోంది. పచ్చరంగుచీరఅంచు గాలికి ఎగురుతూ నా మోకాళ్లమీద పడుతోంది. చంద్రకిరణాలు నున్నని షాలబుగ్గలమీంచి జారిపోతున్నాయి. అలాగే చూస్తూ కూచున్నాను.

నాహృదయం ఆమె స్నేహపరిచయాన్ని పొందాలని ఆతురత పడుతోంది! పైబల్లమీద ఆమగమనిషి గురకలు తీస్తున్నాడు. క్రిందబల్లమీద ఆపెద్దామె కన్నుమూసింది. ఇలాంటి ఏకాంతం మరుక్షణంలో లభిస్తుందా? ఇప్పుడే హృదయాల్ని దగ్గరకు చేర్చాలి. ఈ సాహసకృత్యం నేను చేయలేక పోతున్నాను. ఆమెవల్ల అసలే కాదు. మగవానికి ఒక వంతు అయితే, ఆడదానికి పదివంతులు సిగ్గు ప్రసాదించాడు విధి. మూడోవాడొచ్చి కలపాలి. మూడోవాడొస్తే ఏకాంతం ఉండదే!

సన్నని తుంపరలు కిటికీలోంచి లోపలికి వచ్చిపడ్డాయి. బయటికి చూస్తే ఆకాశంలో చంద్రుడు కనబడలేదు. మబ్బుతునకలమధ్య నలిగి రాలిపోయి, ఆమె మొహంలో కలసిపోయాడు. వర్షం వచ్చేసింది అమాంతంగా. కిటికీ మూసేయాలని ఆమె ప్రయాసపడుతోంది. ఆమె ప్రయత్నం వృథా అయింది. వర్షం లోపలికి వచ్చేస్తోంది. నావైపు రెండుమూడుసార్లు చూచింది. మొహంలో చిఱునవ్వు కాంతులు తళుక్కుమంటూనే ఉన్నాయి. కళ్ళే ఆమె భావాన్ని చెప్పాయి. నేను గబగబలేచి కిటికీ మూసేసాను. ఆమెకృతజ్ఞతతో నావైపు చూసింది.

ఆమెను మాట్లాడిద్దామనే ఉద్దేశ్యంతో నాదగ్గరున్న పత్రికల్ని తిరగేశాను. ఆమె అడిగితే అన్నీ ఆమె నెత్తిన కురిపిద్దామని నా ఆలోచన. మధ్యమధ్యలో బొమ్మల్ని చూస్తూ గట్టిగ నవ్వుతూ ఓరగా ఆమెను చూస్తూన్నా కాని ఆమెనోరు మెదపలేదు. ఆమెమౌనం, దానికి విరుద్ధంగా ఆ చిఱునవ్వు కొంతదాకా అర్థంకాలేదు అతిలజ్జ ఆమెనోరు కట్టేసిందని తట్టింది మనస్సుకు.

ఆమె ముఖంలో ఏదోశక్తి దాక్కొని ఉంది! అదే గొంతుకు పట్టేస్తోంది! చిన్న ప్రశ్న ఏదైనా అడుగుదామన్నా, నోరు తెరిస్తే మైకంలో అనుకున్నప్రశ్న వస్తుందో మశేం వచ్చేస్తుందో నని భయం. ఆ సమయంలో నాలో మరోభావనే ఉంటే నిస్సంకోచంగా మాట్లాడగలిగేవాణ్ణి, ఎంతమంది మనుష్యులు ఆమెచుట్టూ ఉన్నా సరే. కాని ఇప్పుడు భావన వేరు. ఈ భావన స్త్రీపురుషుల హృదయాల్లో ప్రవేశిస్తే, ఇద్దరినోరూ కట్టిపోతుంది! మనస్సు దుర్బలమయిపోతుంది. సిగ్గు ముంచేస్తుంది చేష్టలే వాళ్ల భావాల్ని పరిచయపరుస్తాయి! వాటితోనే మాట్లాడుతారు!

పడుకున్నామె లేచింది. బండి స్టేషనులో ఆగిఉంది. గొంతుక ఎండిపోతోందంది. కూర్చున్నయువతి కిటికీ తెరచి బయటకు తొంగిచూస్తూ నీళ్లవాడెవడైనా వస్తాడేమో చూస్తోంది. ఆ అర్థరాత్రిలో నీళ్లు ఎవరు తెస్తారు బండిదగ్గరకు? రెండుమూడుసార్లు పైసీటుమీద పడుకున్న వ్యక్తివంక చూసింది. కుంభకర్ణనిద్రలో ఉన్నాడు. సందర్భం చిక్కింది పల్కరించడానికి—"నీళ్లు తెస్తాను" అని మరచెంబు అందుకోబోయాను.

"మీరు వద్దండి" అంటూ చేయి వెనక్కులాక్కుంది.

"యివ్వవే అమ్మాయి మరచెంబు" అందా పెద్దామె. చేయి ముందుకు చాచి మరచెంబు తీసుకుంటూన్నాను. చేతులు స్పృశించాయి వెంటనే నాఒళ్లంతా విద్యుచ్ఛక్తి ప్రాకింది! చెంబు జారి పడిపోయింది. ఇద్దరం గబుక్కున చెంబు తీసుకోనేందుకు వంగాం. మళ్లా యిద్దరిచేతులు స్పృశించాయి తొట్రుపాటుపడ్తూ తత్తరడంలో ఇద్దరి తలలూ మెల్ల ఢీకొన్నాయి. యిద్దరి పెదాలమీద నవ్వు ప్రకటితమయింది. చకచకా దిగి వెళ్లి నీళ్లు తెచ్చి యిచ్చాను. కృతజ్ఞతతో చిరునవ్వు నవ్వింది. మళ్లా అదే చిఱునవ్వు, అదే బెదరుపాటు కనిపించాయి.

మళ్లీ ఓపెద్ద స్టేషను వచ్చింది. మా ఆనందానికి అంతరాయం వచ్చింది. ఓమనిషి చరచరా ఎక్కాడు. నల్లటి దుక్కశరీరం. వంటిమీద బంగారు గొలుసు జిగజిగలాడుతోంది. రావడంతోనే నాకు ఆశ్చర్యం కోపం కల్గించేట్లు—"ఎక్కడికి వెళ్తున్నారు? కొంచెం జరగండి—" అంటూ నవ్వుమొహంతో ఆమెప్రక్కనే చతికిల

(33 వ పేజీ చూడుడు)



శతావధానమున అమరయశస్సు నొందిన తిరుపతి వేంకటకవులు.

# మహాకవి



బందరు హిందూహైస్కూలు



శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, వారి కుటుంబం.



విగతజీవులై భూశయనగ



# అస్తమయం

గా పనిచేసిన శాస్త్రిగారు.



ఆంధ్రపత్రిక నాశీర్వదించిన శాస్త్రిగారు.



ంలై యున్న శాస్త్రిగారు



ఆస్థానకవి పట్టప్రదానసమయంలో శాస్త్రిగారు అందుకున్న బహుమతులు.

# గురుదేవునకు - భక్త్యంజలి

శ్రీ రెంటాల గోపాలకృష్ణమూర్తి

కూలిం దోక వటవృక్షం!
రాలిం దోక గగనతార
ఆరిం దోక దివ్యజ్యోతి!
మూరిం దోక మహిమోన్నతి!
పిడుగువంటి వార్త విని
కొట్టుకున్న మా గుండెలు
ఆగిపోయె ననుకొంటిమి
పోలే దీ శిష్యకోటి
నిలిచిం దోక బాధతోటి—
విన్నాడా! విశ్వనాథు
డున్నాడా! మీ సన్నిధి
ముద్దుల శిష్యుడు ముందట
మీ గద్దెకు తగినవాడు—
నీవు లేని తెలుగుధాత్రి
చంద్రుడు లేని కాళరాత్రి
అర్ధశతాబ్ది మీ కవనం
ప్రవహించిం దీభువనం.
తెలుంగుకవితాసాహితి
రంగంలో వెలుగు జూపి
విప్లవశంఖఘోషలు
విజయంతో వినిపించీ
ఆంధ్రావనిఅంతటినీ
ఉర్రూతలు ఊగించీ
జరిపించిన విజయయాత్ర
సాగించిన జైత్రయాత్ర
మరువరు ముక్కోటాంధ్రులు
మిగిలిన మీ ఆస్థంతా
తెలుగురాణి అమరవాణి
జోహారులు! చెళ్లపిళ్ల
కైమోడ్పులు! వేంకటేశ!

---

# కవి శివరాత్రి

శ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి

తిరుపతివేంకటేశకవి - ధీరుల దిర్వురి మున్నె పోయె, నే
డురుతరవాక్ప్రచారముల - యుక్కళమో యనసైన వేంకటే
శ్వరకవి యస్తమించుట ది - వాకరచంద్రులు లేనిచందమై
పరగ 'విరోధి' నానభ-వం బిటు లయ్యెనె యాంధ్రభూమికిన్?
గుటి నే డీశివరాత్రి వేంకటకవిం - గొంపోవ నేర్పడ్డదా?
యరయం జూడరె మంచిచెడ్డ లివు డయ్యెయ్యాంగ్లమర్యాదులే,
చవలగ్నంబున చెళ్లపిళ్లకవి'నా - స్థానంబు నెక్కించిరో!
పరలోకానకు మూటగట్టె మన దౌ - ర్భాగ్యంబెగా కేమగున్?
విన, 'జన్మనకు శివరా
త్రి' సాగ, మరణాన కానె? తిరుపతి గలియం
జని దివి శివు సాస్థానం,
బు నెక్కె, సుముహూర్త మిట్టి, పుణ్యదినంబౌన్||
భోజులు లేని కాలమున - బుట్టియు నాంధ్రకవిత్వకన్యకం
దేజ మెలర్ప దేశముల - ద్రిప్పి యశంబు గడింపజేసి, నా
నాజనపాలమైత్రిని గ - నందగదే? బహుకావ్యపుత్రికా
రాజిని గాంచి యెల్లరను - రంజిలజేయుట గాంచి స్థైర్యమున్||
వరకవితావితానముల - వాసికి నెక్కిన యాంధ్రభూమిలో
సురుచిరవాక్స్రవంతులను - సొంపుగ మల్పి, నవీనవాగ్ఝరిం
బరిణతవాక్ప్రచారముల - వంతెన వేసిన యింజినీరులా
తిరుపతివేంకటేశులు గ - తించు టదేటిది? బాటమేటిగాన్||

---




# విద్యాప్రభావం

పూర్వము ఒకరోజున దయ్యములన్నియు కలసి ఒక సభ ఏర్పరుచుకొన్నవి. ఆ సభలో దయ్యములకు రాజగు పెద్దదయ్యము, మిగతా దయ్యములందరితో "ఇవ్వాళ మీరందరు ఎవరిదారిన వారు వెళ్ళి,



విచిత్రమగు ఒక గొప్ప పని ఎవరైతే చేసుకొనివస్తారో వారిని నావద్ద మంత్రిగా ఉంచుకొంటా" నని చెప్పాడు. మిగతా దయ్యములందరు ఆ మాటకు అంగీకరించి సంతోషముగా అందరూ రకరకాల వేషములు ధరించు ఒక పట్టణము చేరుకొని తలొకతావునకు వెళ్ళిరి.

అందులో ఒక దయ్యము ఎప్పుడో దెబ్బలాడుకొని మాటలు మానుకొన్న భార్యాభర్తలకు తగవు తీర్చెను. మరిఒక దయ్యము-పొలములకు పోయి పనివారలకు సంతోషము, ఉత్సాహము కలుగజేసి రెండురోజులకగు పనిని - ఒక రోజుకే పూర్తి చేయించెను. మరియొక దయ్యము వెళ్ళుచున్న

**అమానుల్లాఖాన్, అమీర్**

ప్రయాణీకులను బెదిరించి వారివద్ద ధనము, ద్రవ్యమును తీసుకొని బీదవారికి ధర్మము చేసెను. మరిఒక దయ్యము ఎన్నిరోజులనుండో ఆపదలో నున్న బీదముసలివానిని ఆపదలోనుంచి రక్షించెను—

వీళ్ళు ఇట్లుండగా - వీరిలో ఒక కుంటిదయ్యము, తిన్నగా పాఠశాలకు వెళ్ళి చదువుకొనుటకై వచ్చిన పిల్లలను ఎవరు చదువుకోకుండ. చెదరగొట్టి ఎవరియిళ్లకు వారిని తరిమివేసెను.

వీరుఅందరు ఒక్కొక్క ఘనకార్యము సాధించి సాయంకాలమునకు తమ రాజు అగు పెద్దదయ్యమువద్దకు చేరికొనిరి-పెద్దదయ్యమునకు ఎవరు చేసిన పని వారుచెప్పకొనిరి. ఆఖరికి కుంటిదయ్యమును అడగగా కుంటిదయ్యము "నేను చదువుకొనుటకై వచ్చిన పిల్లను చదువకుండా ఎవరియింటికి వారిని తరిమివేసినా" నని చెప్పెను. దయ్యముల రాజు కుంటిదయ్యము వీపు మీద చరచి "శభాష్ - వీరి అందరిలో గొప్ప ఘనకార్యము చేసుకొచ్చినవాడవు నీవే నని వానిని తన వద్ద కూర్చోబెట్టుకొనెను. మిగిలిన దయ్యములందరికి కోపము వచ్చెను. అందులో ఒక దయ్యము రాజుతో, "ఓరాజా మేము కష్టపడి యింతింత గొప్ప పనులు చేసుకొనివస్తే యీ కుంటివాడు వట్టి చదువుకొనుటకై వచ్చిన పిల్లను చదవకుండా తరిమినందుకు నీవు ఇంత గొప్పగా ఇతనిని గౌరవిస్తున్నావుగదా మేము చేసుకొనివచ్చినపనికంటే గొప్పదా వీని పని? చదువుకొనుటకై వచ్చిన పిల్లలను చదువకుండా తరమడములో ఏమి గొప్ప ఉన్నది?" అని అడిగెను. అనగా రాజు "ఓ పిచ్చివాడా. యీ కుంటిదయ్యము చేసిన పని సామాన్యమైనది కాదు, నీవు చదువు

అంటే ఏమో అనుకొంటున్నావు. చదువున్నవారికి చదువులేనివారికి చాలా తేడా వున్నది. అందుచేత నే కుంటిదయ్యము, ఆ చదువురాకుండ తరిమినాడు. అది నీకు అర్థముకావా లంటే నీవు పోయి చూడవచ్చును," ఆదయ్యము. "అదేమిటో నేను చూస్తాను దాని అంతు కనుక్కొంటాను" అనెను. రాజుదయ్యము, "అలాగైతే నీవు యీవేళే అర్ధరాత్రి బయలుదేరి యీవూరిలో విద్య రాని వెంకయ్య వున్నాడు. అతనికి చచ్చినంత ధన మున్నను, అది యంతయును ఒకరి పొట్టగొట్టి ఒకరిని నానాహింసలు పెట్టి సంపాదించిన ధనము. కాని విద్య అనేది పొట్టకోసినా ఒక అక్షరము ముక్క లేదు. అతనిని నీవు యీరాత్రిసమయమున వెళ్లి ఏ విధముగా అవమానించి వస్తావో. అవమానించి రావాలి" అనగా ఆదయ్యము ఆ మాటకు అంగీకరించెను. ఆ దయ్యము ఆరాత్రే ప్రయాణమయి అర్ధరాత్రి వెంకన్న వున్న యింటి ముందు ఒక గాడిదతోనూ సున్నము బొగ్గు మసి మొదలగు పధార్థములతోను దుర్వాసన కలిగిన సెంటుతోనూ తయారయ్యెను— వెంకయ్యనిద్రపోవుచున్న గదివద్ద చేరుకొని తలుపు నెమ్మదిగా తట్టెను. వెంకయ్య మేలుకొని ఎవరది అని ప్రశ్నించెను. దానికి దయ్యము యిలా గనెను - "నేను భగవంతునివద్దనుంచి రాగలిగిన దూతను. భగవంతుడు మిమ్మల్ని మీ ధనమును మెచ్చి స్వర్గలోకానికి తీసుకురావలసినదని యీకళ్యాణి గుఱ్ఱమును నన్ను పంపించెను."

అనగానే వెంకయ్యసంతోషమునకు మేరలేక "నన్ను స్వయముగా స్వర్గానికి రమ్మనటము చాలా అదృష్టము, నేను యిప్పుడు రావటానికి సిద్ధముగానే ఉన్నాను" అనెను. దయ్యము "అలాగైతే మీరు ఒక పని చెయ్యాలి - గుఱ్ఱము మీద ఎక్కకముందు మీరు కళ్ళకు గట్టిగా ఒక గుడ్డ కట్టుకోవాలి: అది ఎందుకు అంటారేమో. గుఱ్ఱము ఆకాశముమీదుగా పోవునపుడు మీరు భయపడి పడిపోవచ్చును. దానికి యీగుడ్డ కట్టుకోవాలి. మరి ఒక మాట వున్నది. మీరు స్వర్గానికి చేరుకొన్నతరువాత మిమ్మలిని దేవకన్యలు వచ్చి అనేకరకాలుగా మాట లంటారు. దానికి మీరు ఏమియును తొందరపడకూడదు సుమా" అని చెప్పెను. వెంకయ్య దానికి అంగీకరించి, అలాగే నని కళ్లకు గంతకట్టించుకొనెను. బయట నుంచొనివున్న గాడిదమీద వెంకయ్యను వెనుకముఖముగా కూర్చొబెట్టెను. పిమ్మట వాడు తీసుకొని వచ్చిన దుర్వాసన కలిగిన పదార్థములను మసి సున్నములను వెంకయ్యవీపుమీదను తలకు, శరీరమంతయును పూసి గాడిదను నడుపుకొని బయలుదేరెను. వెంకయ్య యీదుర్వాసనకు ఆశ్చర్యపడి ఇదేమి వాసన? అని అడిగెను. దానికి దయ్యము "యీవాసన మీకు తెలియదు దీనిని ఏన్నో విధములుగా వాడుతుంటారు. మాస్వర్గలోకములో దేవకన్యలకు నచ్చే యీవాసన మీకు అర్థమవ్వదు" అనెను. వెంకయ్య నిజమనుకొనెను. ముందు వెళ్ళుతున్న గాడిదమీద వెనుకకు తిరిగి కూర్చొనిఉన్న వెంకయ్యకు ముందుకు తూలుతున్నట్లయి నిజముగా ఆకాశముమీద కళ్యాణి గుఱ్ఱము వెళ్లుతున్నదని సంతోషించి మధ్య మధ్య "యింకెంత దూరమున్నది స్వర్గలోకము?" అని అడుగుచుండగా "యింకెంతో దూరము లేదు యింకెంతో దూరము లేదు." అని చెప్పి దయ్యము తెల్లవారేదాక, పట్టణములో వీధులన్నీ త్రిప్పి, ఆఖరికి - ఒక దేవాలయము ముందుకు తెచ్చి విడిచిపెట్టి మాయమయ్యెను. తెల్లవారుజామున పూజకై వచ్చుచున్నవారందరు యీ వేషములో వున్న వెంకయ్యను చూచి "యిదేమి వేషమోయి వెంకయ్య?" అనెడిమాటలు స్వర్గలోకములో దేవకన్యలు సరాగము లాడుచున్నారని యెంచి, ఓపికతో ఏమియును మాటలాడకుండా కూర్చొని ఉండగా, వారు హాస్యము లాడుచు చివరకు వాని కళ్ళకు గంతలు కట్టియున్న గుడ్డను లాగి వేసిరి. చివరకు చూస్తే వెంకయ్యకు అయిందితా ఆశ్చర్యమయినది. చివరికి అందరు హేళన చేసి, బాదడము మొదలుపెట్టిరి. ఆ దెబ్బతో వెంకయ్య సిగ్గుపడి ఎంతపని జరిగినది అని దుఃఖించుచు యింటికి పారిపోయెను. యిది అంతయు చూచి దయ్యము నవ్వుచు, తన రాజువద్ద చేరుకొని జరిగినదంతయును చెప్పగా, రాజు "అలాగైతే నీవు మంచిపని చేసినావు. ఆ వూరిలోనే విద్యార్థి అగు రామనాథం అన్న వ్యక్తి వున్నాడు. అతను ఎప్పుడు

(26-వ పేజీ చూడుము)

# లేనిపోని ఏడుపు

శ్రీమతి కొడివేమల ప్రసన్నరాణి

ఒకవూళ్లో ఒక ఇంట్లో భర్త ఏపని చెప్పినా భార్య "లేనిపోనిఏడుపు" అని విసుక్కుంటూవుండేది. ప్రతిపనికీ మొదట ఆ దేమాట అంటూ వుండేది. కొన్నాళ్లు భర్త వింటూ ఓపికపట్టాడు. ఇక అతనికి విసుగెత్తిపోయింది. లేనిపోని ఏడుపు అంటే ఏమిటో భార్యకు తెలిసేటట్లు ఒక తమాషా చెయ్యాలను కొన్నాడు.

ఒకనాడు భార్యతో "నాకు పని వుంది. మీ వాళ్ల ఇంటికి వెళ్లాలి" అన్నాడు. ఆవిడ తానుకూడా వస్తానంది.

"ఇప్పుడు వద్దు. నేను వెళ్ళివచ్చిన తరువాత నీవు వెళ్లుదువుగానిలే," అన్నాడు. సరేనంది. పుట్టింటికి తీసుకొని పోవటానికి లడ్డులు అరిసెలు మొదలైన పిండివంటలు చేసి మూట గట్టి భర్తకు ఇచ్చింది. భర్త అవి తీసుకొనిపోయి, దారిలో చెరువుగట్టు దగ్గర అన్నీ కడుపునిండా తిని,ఆ చెరువులో నీళ్లుత్రాగి, వట్టిచేతులతో మామగారింటికి వెళ్లాడు. వెళ్ళి అరుగు మీద దర్జాగా కూర్చున్నాడు. అత్తగారు చూచి కాళ్లకు నీళ్లు ఇచ్చి "అందరూ బాగున్నారానాయనా?" అనిఅడిగింది. "ఆ అంతా బాగానే ఉన్నారు. మీఅమ్మాయి గర్భిణిగా వుంది. ఐదవమాసం" అని సమాధానమిచ్చాడు. ఆమాట విని అత్తగారు సంతోషంతో "నేనుకూడా వస్తా నాయనా నీతోకూడా" అంది.

రెండుమూడురోజు లుండి ఇంటికి బయలుదేరాడు. అత్తగారు కూడా ప్రయాణ మయింది. ఇప్పుడెందుకు లెండి. నాకు మళ్లీ పని వుంది, నేను



మళ్లీ వస్తాను. అప్పుడు వద్దురుగాని" అని చెప్పాడు. సరేనని ఒప్పుకొని ఆవిడ బిడ్డకు పిండివంటలు చేసి కూతురు కిమ్మని మూటకట్టి ఇచ్చింది. అతడు అవి తీసుకొని చెరువుగట్టుదగ్గరకు వెళ్ళి అక్కడ అవి తిని, ఉట్టిచేతుల్తో ఇంటికి వెళ్లాడు.

భార్య "ఏమిటి సంగతులు? మా అమ్మ వాళ్లందరూ బాగున్నారా?" అని అడిగింది.

"ఆ, అంతా బాగానే ఉన్నారు. మీ అమ్మ గర్భిణిగా వుంది. ఐదవ మాసం." అన్నాడు. పుట్టింటికి ఎప్పుడు వెళ్తానా అని భార్య ఆత్ర పడసాగింది. మళ్లీ కొన్ని రోజులకు భర్తఅత్తవారింటికి బయలుదేరాడు. "నేను సర్కారీపనిమీద మీవూరు వెళ్లుతున్నాను. నేను వచ్చినతరువాత నిన్ను పంపిస్తాను" అని భార్యతో చెప్పినాడు. నిరుత్సాహంతో ఆవిడ చిన్నబుచ్చుకొని "పోనీ ఇవన్నా తీసుకువెళ్లి ఇవ్వండి" అని తల్లికోసం మంచి పిండివంటలు చేసి ఇచ్చింది. అవన్నీ తీసుకొని పోయి మునుపటిలాగే చెరువుదగ్గర తిని వెళ్ళాడు వెళ్లి అరుగుమీద విచారంతో కూర్చున్నాడు. అత్తగారు చూచి "ఏం నాయనా అలా విచారంగావున్నావెందుకు? ఎప్పుడు వచ్చావు కాళ్లు కడుక్కో, అంతా బాగున్నారా అమ్మాయికి ఎన్నో మాసం? నేను రావటానికి ఎన్ని సార్లు ప్రయాణం అయినా వీలుపడ లేదు. మళ్లా వస్తానని నీవు రాలేదేం?" అని అడిగింది. ఏముంది? మీ అమ్మాయికి చక్కని పిల్లవాడు పుట్టి పోయాడు." అన్నాడు. ఆవిడ ఏ డ్చి "అంతపని జరిగిందా ం త్త కూ కెందుకు కబురు వినాయ ప్పటికైనా . వెడదాం యలుదేరింది.

సంగతి ారికి మధ్య చెరు

వుదగ్గరకు చేరినతరవాత అతడు అత్తగారితో "మీరు నడవలేకుండా ఉన్నారు మిమ్మల్ని చూస్తే దానికి గుండె పగిలిపోతుంది. మీరు ఇక్కడే ఉండండి. నేను వెళ్ళి మీఅమ్మాయిని మెల్లిగా ఓదార్చి తీసుకొనివస్తాను" అన్నాడు. ఆమె ఎదురుచెప్పలేక సరే నంది. ఇంటికి చిన్నబోయిన మొహంతో వెళ్ళాడు. అతన్ని చూడగానే "ఏమండీ అట్లా వున్నారేం? అంతా ఖులాసా యేనా?" అని అడిగింది. అతడు విసుగ్గా "ఏం ఖులాసానో మీఅమ్మకు పిల్లవాడు పుట్టి పోయాడట. ఏదో విచారంగా వుందిగదా అని నాలుగు రోజులు వుందురుగాని రండి అంటే వచ్చిందిపాపం! నడవలేక ఏడుస్తూ ఆ చెరువుగట్టుదగ్గర కూర్చుంది. నిన్ను తీసుకువస్తానని చెప్పి వచ్చాను" అన్నాడు. ఇక భార్య మొదలుపెట్టిందిఆరున్నొక్కరాగం.

బయలుదేరారు ఇద్దరూ చెరువు దగ్గరికి. చెరువుగట్టు చేరాక ఒక చోట వినాయకుడిలా చూస్తూ కూర్చున్నాడు. ఇక తల్లీకూతుళ్లు వాటేసుకొని విరాం లేకుండా గంటసేపు ఏడ్చారు. ఏడ్చి ఏడ్చి సొక్కి, మాటల్లోకి దిగారు. "ఎట్లా పోయివాడే నీపిల్లవాడు!" అని అడిగింది తల్లి. ఇంతలో "ఎట్లాచచ్చిపోయాడే? ఏంజబ్బుచేసింది తమ్ముడికి?" అని అడిగింది కూతురు.

ఏముంది, చెప్పకొనేందు[illegible]! ఏం తమ్ముడే అంటే ఏం పిల్లవా[illegible] అని తెల్లమొహం వేశారు. ఇద[illegible] చెప్పి ఏడిపిస్తూవున్న ఆ[illegible] కుణ్ణే అడిగారు సంగతి.

అతడు నవ్వుతూ అసల[illegible] చెప్తా వినండి. "నాదేంతప్పు లేదు. అంతా మీ అమ్మాయిదే తప్పు. నేను మీఅమ్మాయికి ఏపని చెప్పినా ప్రతిపనికీ 'లేనిపోని ఏడుపు' అంటుంది. ఆ లేనిపోనిఏడుపు అంటే ఏమిటో ఎలాఉంటుందో తెలియటానికి చేశాను. ఇప్పటికైనా తెలిసిందా ఆ ఏడుపు?" అని భార్య నడిగాడు. ఏం చెప్పుతుంది? తల్లీకూతుళ్లు సిగ్గుతో తలొంచుకున్నారు.

## విద్యా ప్రభావం

(24-వ పేజీ తరువాయి)

తాగుడుతోను సానులతోను తిరుగుచుండును. పరమదుర్మార్గుడు. కాని అతనికి విద్య ఉన్నది. అతనివద్దకు వెళ్ళి అతనినికూడా అవమానించిరావాలి. అప్పుడు విద్య అంటే ఏమిటో నీకు పూర్తిగా అర్థమయిపోతుంది— ఏమయినదో నీనోటితోనే చెప్పు" అని చెప్పెను. "అది ఎంత పని! పెద్ద ధనికుడినే అవమానించినపుడు, ఒక తాగుబోతుని అవమానించటం ఎంతపని? అలాగైతే యీ రాత్రే బయలుదేరి విద్య ఏమిటా దాని అంతు కనుక్కొంటాను" అని దయ్యము ఆ రాత్రే ప్రయాణమయ్యెను.

అలాగే అర్థరాత్రి రామనాథం యింటిముందు చేరుకొని, తలుపు తట్టెను. ఎవరది అని రామనాథం ప్రశ్నించగా నేను, దేవునివద్దనుంచి వచ్చినదూతను. మిమ్మల్ని మెచ్చి దేవుడు మిమ్మల్ని స్వర్గలోకానికి తీసుకురమ్మని ఆజ్ఞాపించినాడు. మీ కోసము కళ్యాణిగుర్రమునుకూడా పంపించినాడు" అని చెప్పెను. రామనాథునికి అనుమానం తట్టి "నేను చూస్తే తాగుబోతుని. నన్ను భగవంతుడు ఎందుకు రమ్మంటాడు? కాదు ఇదిఅంతయును దయ్యాల నాటకము. వీడు నన్ను మోసపుచ్చాలని చూచి వచ్చివున్నాడు. వీడిపని పట్టాలి" అని తలచి నెమ్మదిగా "నేను లేవలేని స్థితిలో వున్నాను. కొంచెము వచ్చి చెయ్యిపట్టుకొని లేవదీయుము" అని కోరెను. దయ్యము లోనికి వచ్చి నెమ్మదిగా వంగి లేవదీయబోవగా రామనాథం కాలిన వున్న జోడుతీసి దయ్యమును జుట్టు పట్టుకొని చెప్పుతో అదే బాదటము. చావబాది - "నన్ను మోసపుచ్చాలని వచ్చావురా" అని కొట్టికొట్టి యింటినుండి గెంటివేసెను. లబో దిబ్బో మనుచు ఆ దయ్యము, రాజు వద్దకు వచ్చి విద్యలోని శక్తి తెలుసుకొన్నా" నని చెప్పుతూ కాళ్ళు పట్టుకొనెను. అప్పుడు రాజు లేవదీసి, "నీవు విద్య అంటే ఏమిటో అనుకొన్నావు విద్యలోని ప్రభావము ఇదేరా. చదువుకొన్నవారికి లేనివారికి యింతే తేడా" అని చెప్పి వానిని దగ్గరకు చేరదీసెను.—

# రుద్రమదేవి

(16-వ పేజీరుతవాయి)

తిక్కనసోమయాజులు ఎంత హృదయభారముతో శ్రీమదాంధ్ర మహాభారతరచన కుపక్రమించినారా యను భావ మావేశించును!

ఉత్తరక్షణములో సోమయాజి మనస్సు దిటవుచేసికొని యిట్లు సాగించెను.

'అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకు
జెప్పి యిట్లను గౌరవశ్రేష్ఠ పద్మ
నాభుతో నవ్విధంబున నారదుండు
పార్వతీదేవి ప్రశ్న ముపన్యసించి'
ఇట్లనియె!

ఆ చెప్పినది గురునాథుండు లిఖించుట పూర్తిచేసెను. అంతట మరల మారన వ్యాసభారతపాఠమున కుపక్రమించెను. తిక్కన యథాపూర్వముగా ధ్యానమననము లొనర్చి హృదయములో నా యర్థము కరగించి యాంధ్రచ్ఛందోరూపమున వెలువరించెను.

అట్లు మారన చదువుచుండగా నాపినభాగమున సామాన్యముగా నాంధ్రములో తిక్కనసోమయాజులకు వచనము వెలువడును. వచనమునకు గద్య యని పేరు. అది గద్దె; ఆసనము; నిలుచుచోటు! సంస్కృతపఠనము నిలిచినయెడల నెల్ల వచనము వచ్చుచుండుట ప్రకృతిసిద్ధము. ఇట్లు చేయవలె ననుకొని చేసినది కాదు. కవిమనస్సు విశ్రమించు నెడల వచనమే సాధారణముగా వచ్చుట స్వాభావికము!

'శివుడు పార్వతికి వర్ణాశ్రమాచారముల తెఱఁగెఱిగించు' ఘట్టముతో నా యుదయమున ప్రారంభ మైనది. మధ్యాహ్నమగు నప్పటికి ఆ ఘట్టము పూర్తియై 'శివుడు పార్వతికి దపస్స్వరూపంబు సెప్పు' ఘట్టము సగ మయ్యెను. విశ్రమించి మరల వచ్చినపిమ్మట ముందు సోమయాజి తా నాఁడుదయమున చెప్పిన భాగము గురునాథుడు వినిపింపగా నాలకించెను. అట్లు వినుచు మరల స్ఫురించిన సవరణలు చేయించెను. కాని యట్టి సవరణలు క్వాచిత్కములు. అపైని మరల యథాప్రకారము రచన ప్రారంభించి యాఘట్టము పూర్తిచేసి 'శివుడు పార్వతికి రాజత్వమహిమాతిశయంబు సెప్పు' ఘట్ట మందుకొని చెప్పుచుండెను.

కేశవస్వయంభూనికేతనములు రెండును ఒకేప్రాకారమధ్యమున గలవు. అందు దక్షిణముఖముగా స్వయంభూదేవాలయమును పశ్చిమముఖముగా కేశవాలయమును ఉన్నవి. ఆ యాలయములలో సాయంకాలపూజకు చాలతడవు ముందుగనే అర్చకు లా యాలయముల ద్వారములు తెరచి యందలి యఖండదీపములలో తైల ముంచి వత్తులు సరిచేసి ఆగమోక్తులు పఠించుచుండిరి. మధ్యమధ్య భక్తులు స్వయంభూతేశ్వరునకును కేశవస్వామికిని కీర్తనసమస్కారాదికము లర్పించి సేవలు చేయించి తీర్థప్రసాదములు గ్రహించి వెడలి పోవుచుండిరి.

అంతలో నాలయప్రాకారమునం దంతట నొక సందడి యారంభించెను. అది యలజడి కాదు. అప్రమత్తులై యుండ యత్నించు నర్చకుల సందడి! ఆలయావరణములో నున్న మండపాదులలో విశ్రమించియు సల్లాపములు చేయుచును పనసలు చెప్పుచును శాస్త్రార్థములు చేయుచును నవ్వుచును కేరుచును పలువిధముల నున్న బ్రాహ్మణులు తాము కట్టిన పుట్టములును పైనున్న యుత్తరీయములును సరిచేసికొనుచు స్వయంభూదేవాలయముఖమండపము లోనికి శీఘ్రగతి నరుదెంచుచున్న సవ్వడి! శౌచహీను లావలకు తప్పుకొనుచున్న సంభ్రమము! సామాన్యజనులు గౌరవదృష్టులతో ప్రక్కల కొదిగి తొంగిచూచుచున్న కలకలము!

శ్రీరుద్రదేవమహారాజులు క్రీడాశైలమునుండి రాజప్రాసాదమునకు బోవుచు కేశవ స్వయంభూనాథుల దర్శించు నిచ్ఛ యదృచ్ఛగా గలిగి యిట్లు వచ్చుచున్నా రను వార్త వచ్చినది. ఇట్లాకస్మికముగా వారు దేవదర్శనమునకు వచ్చుటయును కద్దు; కాని యది యసాధారణము. అందుచేతనే ఈ సంభ్రమము!

స్వయంభూదేవాలయప్రాకారమునకు దూరమున దండధరుల కేకలు వినవైనవి. వందిమాగధులు కైవారములు చేయుచు ప్రక్కల నుండి ఎదురుగుచు దారి సాగుచున్నారు. అంతలో దూరముననే శ్రీరుద్రదేవమహారాజులు అశ్వమునుండి దిగి పాదరక్షలు వదలిరి. ముందు తిక్కచమూపతియు మధ్యను శ్రీరుద్రదేవమహారాజులును ఒకప్రక్కను అంబదేవుడు రెండవపార్శ్వమున పర్వతనాయకుడును వచ్చుచుండిరి. అందరు పాదచారులే! అందరును సరోవారిలో పాణిపాదశౌచము పొంది దక్షిణద్వారము సమీపించిరి.

ఎత్తైన నాలుగు స్తంభములతో ఉదాత్తరమణీయ మగు నా గోపురద్వారమునొద్దకే ఎదురుగా నున్న స్వయంభూదేవాలయము నుండి శివార్చకులును ప్రక్క నున్న కేశవాలయమునుండి వైఖానసులును ఎదురు వచ్చి శ్రీరుద్రదేవమహారాజులకు రాచమర్యాదలు గావించి లోనికి తీసికొని వచ్చుచుండిరి. వేదవిదు లగు బ్రాహ్మణు లిరుగెలకుల రెండు బారులుగా తీరి స్వస్తివాచనము ప్రారంభించిరి.

శ్రీరుద్రదేవమహారాజు సపరివారముగా వారి కెల్లరకు దోసిలి యొగ్గి నమస్కరించుచు నాలయములు రెండిటికిని ప్రదక్షిణము చేసి ముందు స్వయంభూస్వామిని దర్శించి పూజ చేయించి మంత్రపుష్పముతో కానుక లర్పించి యాత్మప్రదక్షిణనమస్కారాదికములు గావించిరి. ఆపిమ్మట కేశవస్వామియాలయములోని కరిగి యట్లే యర్చానమస్కారాదు లర్పించి తీర్థప్రసాదాదులు స్వీకరించిరి.

దేవదర్శనమునకు వచ్చినవారు పూజానంతరము ఆలయమున నించుకతడవు కూరుచుండవలసిన విధి యున్నది. స్వయంభూదేవాలయముఖమండపద్వారమున ఉన్నతము లగు రెండు గజవిగ్రహములు కలవు. అవి నిగనిగలాడు నల్లరాతిలో తొలిచినవి. వాని కిరుప్రక్కలను దీర్ఘవితర్దికలు కలవు. అందులో నొకటి యాలయము పశ్చిమకుడ్యమునకును రెండవది ప్రాక్కుడ్యమునకును అంటి యుండును. ఆ యరుగుల వెనుకను ప్రక్కలను శిల్పులు తీవెలు పూలు సింహములు ఏనుగులు రమణీయముగా తొలిచియుండిరి. వానిలో పడమటిగోడ నానియున్న యరుగుపై శ్రీరుద్రదేవమహారాజులకు మెత్తనై పట్టుకుచ్చులు కల రత్నకంబళ మొంచగా నం దామె యుపవిష్ట యయ్యెను. పరివారమును యథార్హముగా కూర్చుండనగు వారు కూర్చుండియు నిలుచుండువారు నిలుచుండియు నుండిరి. బ్రాహ్మణబృందము ఆశీర్వచనమున కాయత్త మగుచుండెను. అందుకు అర్చకులు వారికి పుష్పాక్షతాదులు పంచిపెట్టుచుండిరి.

ఆ ప్రదేశమునకు పదిబెండ్లదూరముననే తిక్కనసోమయాజులు

మహాభారతరచనము చేయుచున్న మండప మున్నది. ఆలయప్రాకార మధ్యమం దున్నవారెల్లరు మహారాజదర్శనమునకై సమీపమునకును దవ్వునకును మూగిరి. ఆ మంటపములో నున్న యా మువ్వురు వ్యక్తులుమాత్రము ఎట్టి యంతరాయము లేకుండ వారిపని వారు చేయుచునే యుండిరి. వారికి ఆలయమునకు అర్చకులు వచ్చినదిగాని, మహారాజులు వచ్చుచున్నదిగాని వచ్చిన సందడిగాని, పూజాదిక మొనర్చినపుడు కలిగిన సంచలనము గాని—ఏదియు పట్టినట్లే లేదు. అందును మహారాజులు ఆలయప్రదక్షిణము చేయునెడ వారికి నాలుగైదు విండ్ల దూరమునుండియే వెళ్ళియుండిరి. అయినను ఆ మువ్వురు నది పట్టించుకొనలేదు. కేవలము శ్రీహరిహరనాథుని భావవీధిలో నిలుపుకొని శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాసవచనము లనువాద చేయు వారి కీలోకము కన్నులకు కనబడుచున్నను నిజముగా నది భాసించునా ?

ఆ మువ్వుర మూర్తులును శ్రీరుద్రదేవమహారాజులు ఆలయావరణమున బ్రవేశించినప్పటినుండియు వారి నాకర్షించెను. ఎవరు వీరు ? సాక్షాత్తు బ్రహ్మవిష్ణుమహేశ్వరులే యీ మండపములో గోష్ఠి తీరి యున్నారా? వీరు చేయు ప్రసంగ మేమి? వ్రాయుచున్న గ్రంథ మేమి? ప్రదక్షిణము చేయుచున్నతరి మధ్య నొకింత యాగి యది యేమో వినవలె నని మహారాజులకు ఉత్కంఠ కలిగెను. కాని అట్టిది రాచమర్యాదకు భంగకరము ! సందడిలో ఏదియు స్పష్టముగా వినరాలేదు.

అప్పుడే అన్నమంత్రీశ్వరులను కారాగృహమునకు రుద్రమ పంపించియుండెను. ఎంత గౌరవముగా పంపినను తా నామహాత్ముని బంపినది కారాగారమునకే గదా ! ఇందులో తా నేదో మహాపరాధము చేయుచున్నా నని యామెకు హృదయములో స్ఫురించుచుండెను. అన్నమంత్రీశ్వరుడు ద్రోహి యగుట యసాధ్యము ! కాని యంత బలమగు సాక్ష్యసాధనములను త్రోసిపుచ్చుట ఎట్లు ? రాజధర్మ మెంత కఠిన మైనది ! ఈ యాలోచనలతో రుద్రమ మనస్సు వికల మయ్యెను. ఆ మనోవైక్లబ్యము పదిలపరచుకొను నాతోడనే ఆమె రాజప్రాసాదమునకు పోవుచుపోవుచు దేవదర్శనార్థ మిప్పు డిట్లాకస్మికముగా వచ్చినది !

పూజానంతరమున ఆ వితర్దికపై నిప్పుడు రుద్రమ యాసీన యైనది. బ్రాహ్మణాశీర్వాద మింకను ప్రారంభింప లేదు. దక్షిణ గోపురద్వారబంధము పై గల హంసప్రతిమలపై నామె దృష్టి వ్రాలినది. ఇప్పు డా మండపములోని త్రిమూర్తు లేమి చేయుచున్నారో తెలిసికొనవలె నని కుతూహల మామెకు మరల కలిగినది. శ్రద్ధగా నటువైపుకు చెవు లొరజేసి మనస్సు నటు లగ్న మొనర్చినది. ఈ క్రిందిపద్యము లామె దక్షిణకర్ణ తాడనము గావించెను.

'భూసురుల కలుకవుట్టం
జేసి నహుషముఖ్యనృపులు సెడుట ప్రసిద్ధం
బౌసురపతి విప్రునలుక
గాసిబడడె తెలచి పడసెగాదె నయనముల్.'

'కావున విప్రారాధకు
డై వెలయు విభుండు రాష్ట్ర మతని ధనము సై
న్యావలి బంధుత విప్రుల
దీవనలం బొదలు నింత దెల్లము దేవీ !'

రుద్రమ యొక్కమారుగా ఆపాదమస్తకము కంపించెను. స్ఫుటమై మధురమై మంజులమై ఉదాత్తమై ధీరమై తిక్కన సోమయాజుల కంఠము రుద్రమదేవిదక్షిణకర్ణమును తాడనమే చేసెను. ఆ పద్యద్వయము నక్కడ నున్న యందర నెంతో ఆకర్షించెను. ఎవ్వరు మాటాడలేదు. అందరదృష్టులును శ్రవణములును అప్రయత్నముగా నామండపమువంకకే తిరిగెను.

తిక్కన చెప్పిన పద్యములు వెంటనే గురునాథుడు వ్రాయునే గాని యప్పుడు చదివి వినిపింపడు. అట్లవి వినిపించుట ఉదయమో మధ్యాహ్నమో. మరల రచనకు దొరకొనునప్పుడే అది యభ్యాసము! ఐనను మధ్యమధ్య నెన్నడైనను వ్రాసినవెంటనే గురునాథు డాపద్యములు సోమయాజులకు వినిపించుటయు కద్దు. ఇప్పు డా పద్యములు రెండును గురునాథుడు చదివి వినిపించెను.

రుద్రమ మరల ఉలిక్కిపడినట్లయి యటు తిరిగి చూచెను. అది యప్రయత్నముగా జరిగినది. ముందు చదివినది సోమయాజి. ఆతనిది రుద్రమకు ఈశ్వరమూర్తిగా పరమశాంతముగా కానిపించెను. ఈ రెండవమారు చదువుచున్నది స్థూలకర్కశకాయుడగు గురునాథుడు. అనేక రాక్షసులతో యుద్ధములు చేసిచేసి ఒడలు కాయలు కాచిన కేశవస్వామియా ఇతడు? ఇత డింత బిగ్గరగా చదువుచున్నాడేమి? కొట్టవచ్చువానివలెనే చదువుచున్నాడే! కాని యీ కొట్టవచ్చుటలోగూడ నెంత కారుణ్యము అంతర్గతముగా కలదు! ఒక్క స్వయంభూతేశ్వరుడు తాను అన్నమదేవుని బంధించుట ప్రమాదకర మని యుపదేశించుట చాలక కాబోలు, కేశవదేవునిచేగూడ నాదేశింపజేయుచున్నాడు! నేను తప్పనిసరియై అన్నమంత్రీశ్వరుల నీనాడు బంధింపజేసితిని గాని అవజ్ఞ చేయ నుద్దేశించి కాదే!

'ఐనను ప్రత్యక్షముగా నా కన్వయించు వాక్యములు ఇట్లు పల్కుచున్నవా రెవరు వీరు ?'

ఇట్లామె తలంచుచునే యుండగా సోమయాజులవచనవాక్యములు వినబడెను.

'అని నిర్దేశించి కపర్ది గౌరితో వెండియు.'

'అమ్మా ! న న్నుద్దేశించి పల్కినవి కావు. వీ రేదో గ్రంథ కాలక్షేపము చేయుచున్నారు' అని రుద్రమ యనుకొని యాశ్వాసించుకొనుచున్నంతలోనె మారన వ్యాసభారతపఠన మారంభించెను. ఏ గ్రంథమో రుద్రమకు బోధపడక ప్రశ్నించుచున్నదానివలె ఆమె యీ కూడిన విప్రులవంక తిలకించెను. అందులో వృద్ధ బ్రాహ్మణు డామెభావ మెరిగికొని యిట్లనెను.

"అమ్మా—దేవా, శ్రీతిక్కనసోమయాజులు వ్యాసమహాభారతగ్రంథము ఆంధ్రీకరించుచున్నారు. వారిది నెల్లూరు. హరిహరనాథున కది అంకితము చేసినారు గనుక మనవీట నీ కేశవ శ్రీస్వయంభూనికేతనము లున్న యీ యావరణమునకు వచ్చి నిత్యము గ్రంథరచన సాగించుచుందురు. వారు కేవలము బ్రహ్మణ్యమూర్తులే !"

అంతలో బ్రాహ్మణులు ఆశీర్వచనపనస లందుకొని మంత్రపుష్పాక్షతలు శ్రీరుద్రదేవమహారాజుల శిరస్సున నుంచిరి. మహారాజులును ఆ చేరిన బ్రాహ్మణులకందరకు భక్తిపూర్వకముగా తాంబూలములలో ఒక్కొక్కరి కొక్కొక్క సువర్ణ ముంచి సత్కరించిరి.

అంత రుద్రమ తన వెంట వచ్చిన యొక లేఖకుని యొద్దనుండి యొక భూర్జపత్రమును వ్రాయు తూలికయు నందుకొనెను. ఆ పత్రమునలు మొగముల చక్కని పూజలు రంగురంగులతో దిద్దియుండెను. ఆ పత్రముపై నామె స్వయముగా ముత్యాలవంటి యక్కరములు వ్రాసి దానిక్రింద తన పేరు వ్రాసి రాజముద్రిక వేయించి పత్రము నావలివైపున అభయచిహ్నముగా తన దక్షిణహస్తముద్రను అద్దెను. ఆ పత్ర మంతట నామె పుష్పములలో పెట్టి యా మహాభారతము వ్రాయుచున్న సోమయాజుల కిమ్మని యచ్చటి వృద్ధ బ్రాహ్మణున కప్పగించి సపరివారముగా వెడలిపోయెను.

ఆమె వెడలిపోయిన కొద్దిసేపటికే సోమయాజులు ఆ ఘట్టము ముగించి యానాటికి రచన మే చాలించెను.

"ఈనాడు డెబ్బదితొమ్మిది పద్యము లైనవి" అని గురునాథుడు లెక్కవేసి సంతోషముగా చెప్పెను. సోమయాజుల కాశ్చర్య మయ్యెను. "ఆ హరిహరనాథుల కృప! ఎన్నియైనను బలికింపగలడు!" ఇట్లనుచు, "ఇప్పుడు పూజకు వచ్చివెళ్లిన దెవరో ఎరుగుదురా?" యని సోమయాజి మారనను గురునాథుని బ్రశ్నించుచుండెను.

ఆసమయమున వృద్ధబ్రాహ్మణుడు తిక్కనసోమయాజుల యొద్దకు వచ్చి, 'శ్రీరుద్రదేవమహారాజులు ఈపత్రము మీకు అనుగ్రహించినారు' అనుచు నది యందిచ్చెను. సోమయాజి యా వృద్ధ బ్రాహ్మణునికి నమస్కరించి యది యందుకొని కన్నులకద్దుకొని ఇట్లు చదువుకొనెను.

"శ్రీరుద్రదేవమహారాజు లిచ్చిన యభయపత్రిక.

"శ్రీ తిక్కనసోమయాజులకు ఏకశిలానగరమున నెందైనను ఏవేళనైనను నిర్నిరోధముగా సంచరింప ననుజ్ఞయిచ్చుచున్నాము. వారి సర్వస్వాతంత్ర్యమునకు అభ్యంతర పెట్టినవారు మాచే శిక్షకు పాత్రు లగుదురు.

శ్రీరుద్రదేవమహారాజు

(వరాహముద్రిక)

వెనుకవైపున అభయహస్తముద్రయు తిక్కనసోమయాజులు తిలకించెను.

"ఆ వచ్చినది రుద్రదేవమహారాజులే, మహారాజు లేనా, గురునాథా?"

తిక్కనసోమయాజు లంత సరోవరము సమీపించి సాయం సంధ్యావందన మాచరించి కేశవశ్రీస్వయంభూదేవులకు మ్రొక్కిరి. అప్పటికే మహారాజుల యాజ్ఞ వృద్ధబ్రాహ్మణుని ముఖమున దెలిసిన యర్చకులు మునుపటికంటె నినుమడించిన యాదరగౌరవములతో సోమయాజులయెడ బ్రవర్తింపసాగిరి. అక్కడనుండి గృహాభిముఖులై యాయన వెడలుచుండ, ఆ వార్త ఎట్లు నగరమునం దంతట ప్రాకెనో, భటులు రాజపురుషులు—నందరు సోమయాజులకు సగౌరవముగా నమస్కరించుచు తొలగువారే! ఇట్లు మును పెన్నడు లేనంత గౌరవ మానాడు సోమయాజులకు లభించెను.

ఆ మార్పు కించుక వింత నొందుచు సోమయాజులు ఇంటికి రాగానే అన్నమంత్రీశ్వరులను ఏకాంతవాసమునకు పంపిన వార్తయు వారికి తెలిసెను.

అన్నమంత్రిభార్యలు పార్వతియు లకుమాంబయు సోమయాజులకు చింతాక్రాంతహృదయములతో నమస్కరించి దీవనలందిరి. కాని యా యన్నమంత్రిసత్తముని తల్లి గౌరమమాత్రము సోమయాజుల ఎదుటకు రాలేకపోయెను. 'కారణజన్ముడగు మహాయోగికి ఈదశ ప్రాప్తించు టేమిటి?' అని ఆమె మాటిమాటికి ననుకొనును. కన్నీరు వదలును.

ఇంట నున్నవా రందరును చింతాక్రాంతహృదయులై యుండిరి. కాని యం దొక్కరును ఆ విషయము ప్రస్తావింపరు. కారణ మే మని ప్రసంగించుకొనరు. ఇంటికి వచ్చినవారికి యథాపూర్వముగా గౌరవాదరములలో మార్పు చూపరు.

అన్నమంత్రీశ్వరుని ఆరేళ్ల చిన్నకుమార్తెకు మాత్ర మావార్త తెలియదు. కాని అది యందరి ముఖభంగులు చూచుచు నేదో విశేష మున్న దని యూహించెను. కాని దాని కెవ్వరును రహస్యము చెప్పలేదు. ఆ పిల్ల దిగులుపడిపోవునని యట్లు పార్వతి శాసించెను.

ఆ పిల్ల సోమయాజుల కెదురుగా వచ్చి యాయనచేయి ప్రేమతో పుచ్చుకుని, 'తాతగారూ, మా నాన్నగారు ఇంకా రాలే దేమి?' అని ప్రశ్నింపసాగెను.

సోమయాజులు ఆదరముతో నా పిల్లదేహము నిమురుచు 'నేమి చెప్పవలెనో తోపక మిన్నకుండెను. అయనకలవరము గురునాథుడును మారనయు గ్రహించిరి.

బాలకు అప్పటికి మారన యన్న సిగ్గును గురునాథుడన్న భయమును బోయినవి. వారు ఆ పిల్లను నెమ్మదిగా మరిపించుచు మాటలలోనికి దింపిరి.

నిర్లిప్తు డగు సోమయాజులనుగూడ ఆపిల్లమాటలు కలవరపరచసాగెను. తానే అన్నమంత్రీశ్వరుల నిర్బంధమునకు కారకుడనేమో అను అనుమానమును సోమయాజుల కంకురించెను. చాల పసిమాటలు చెవులలో మాటిమాటికి దూరుచుండుటచే సోమయాజులా రాత్రి భోజనము చేయలేకపోయెను. రాత్రియంతయు నాపిల్ల 'తాతగారూ, మా నాన్నగారు రాలే దేమి?' అని తన్ను ప్రశ్నించుచున్నట్లే తలపోయుచు సోమయాజులా రాత్రి జాగరణమే చేసెను.



# తాళ్ళపాకవారి పదములు

**శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ**

### ౪౬

(సంపు. 3 : పదం. ౫)

అన్నమయ్యాగారి రచన

కాంభోజిరాగం - త్రిపుటతాళం

[పల్లవి]

(౧) , పా , ధ సాఀ పా। పా మ ధ ప మా గా గా , రి రి గా స।, గ గ మ గ రి స సా రి గ। సా , , , , ,।
రా కం చే మా ను గా క రం తు లే టి కే

(౨) , పా , ధ రీ సఀ ని ధ ధ ని పా। పా ని ధా మ మ గా రి రి గా స।, స రి గ ప గ మ రి గ సా రి గా స సా , , , ,
రా కం చే మా ను గా క రం తు లే టి కే

(3) , పా సఀ ధ సఀ రీ గఀ మఀ గాఀ సాఀ। మ ప ధ సఀ ధ ప మ గా రి రి గా స।, స రి ని ధ ధ ప మ గ స రి। రి గా స సా , , , ,
రా కం చే మా ను గా క రం తు లే టి కే

[అనుపల్లవి]

(౧) , గ ప ధ సఀ సాఀ। రీ , గఀ సాఀ , ని ధ పా ధా।, మ మ పా , ధ సఀ ధ ధ ప మ ప మ గా , మ గా రి
వే క పు గు బ్బ లాం డ్ల వి భు డా త డు
సా , రి ॥ గ మ
(రాకంచే)

(౨) , గ ప ధ సఀ సఀ రీ। గఀ మఀ గఀ రీ గఀ రీ సఀ ని ధ ప ధా।, మ మ పా , ధ సాఀ రీ సఀ ని ధ। ధ ప మ గ రి స
వే క పు గు బ్బ లాం డ్ల వి భు డా త
స రి గ మ ప ధ ని ద। ప మ
డు
(రాకంచే)

[చరణం]

, ధ ధ ధా ధా। ధ ని ధ పా ధ ని ధ ని ధా।, ధ ప ధా సాఀ। ధ స ని ధా , ధ ప మా
అం పిన క స్తూర మొ ల్ల నం చే తా వ ను గా క్ష

, గ మ పా పా । మా, ప ధ ప మ మ గా మా ।, ప ధ ప ధ రి స స నీ , ధా । ధనిపా , , , ,
వం పు మో ము తో డ నీ కు వా డ నే టి కే

, మ గ పా ధా । స రి గా మ గ రీ । స ధ స రీ,గ సా । ధా రి స ని ధ ధ ప ధా
చెం ప ల ల ప్పు లు నిం డ జె రి గి న క ప్పూ ర పు

, ప ధ స,రి గ మ రి గ సా । స ధా ని ధ ప మ మ ప ద ।, మ మ పా , ధ స ధ ధ ప మ ప మ గా ,
గం ప కా ప్పు ల స తు ల ఘ ను డా త

మ గా రి సా , రి ॥ గ మ (రాకుంటే)
డు

ఇట్లే క్రిందిచరణములు :

(౨) ఒద్దికగా నక్కడనే - ఉంటే తా నుండుగాక,
ముద్దుమోము వంచి నీకు - మ్రొక్కనేటికే;
చద్దికి వేడికి మంచి - చక్కని సతుల మోవి
పొద్దు పొద్దు కొరగించే - భోగ్యయాతడు ॥ (రాకుంటే)

(3) అబ్బురపు వేంకటేశు - డైతే తా నవుగాక,
గబ్బిచూపులెల్ల నీపై - గప్పనేటికే;
జొబ్బిలేటి జవ్వాది - సోనల పన్నీట నిను
గుబ్బలంటి సరసాన - గూడి నాతడు ॥ (రాకుంటే)

లఘుటీక : వేంకటేశుడు చెప్పంపినా రాలేదని దుఃఖించే నాయికతో ఇంకొక్క వివేకవతి చెప్పిన మందలింపు పదవస్తువు.
వేకపు = జరుగ్గైన; లప్పలు = పెళ్ళలు; చద్దికి వేడికి = చిఱుతిండి కావలసినప్పుడూ, పూర్ణభోజనము కావలసినప్పుడూ; గబ్బిచూపులు = మదనమదముగలచూపులు; నీపై = నీవొక్కతెమీదనే; 'నీకును ఒక్కసారి అతని పూర్ణప్రణయామృతం లభించింది. అంతకు తృప్తిపడుము. కాని నీకే అత డేమీ గుత్తకుగొన్నవాడు కాడని తరువాతి చరణార్థపు భావము.

ముద్రితపాఠములు : ఒద్దికగా కక్కడనే; చదికి వండికి; కూడె నాతడు.

---

# జేబులో వింతలోకం

(9 వ పేజీ తరువాయి)

ఆయుధంవాత బడి రాతిగొడ్డళ్లు, రాతిపలుగులు, రాతి కత్తులు ముక్కలు ముక్కలై పోయుంటాయి. ఆ మానవుడి చేతిలో పళతళలాడే ఈ ఆయుధం, అతనిలో అపూర్వమైన సాహసపరాక్రమాల్ని ప్రేరేపించి ఉంటుంది. ప్రపంచంలోని సమ్మెటలూ, సుత్తులూ ఒక్కపెట్టుని నా చెవుల్లో గింగురుమన్నాయి. పురాతనకాలపు యుద్ధాల్లో తళతళలాడుతూ రుధిరక్షాళన చేసిన కత్తులూ ఆధునికప్రపంచసంగ్రామాల్లో మారణహోమం చెయ్యగలిగిన లోహవాహనాలూ శకటాలూ, చక్రాలూ నా కళ్లకు కట్టాయి.

చాకంటే ఏమిటి? చిన్న కత్తేగదా? పెన్సిల్ చెక్కే చాకంటే దాని హృదయంలో ప్రచండమైన కరవాలం దాగి ఉంది. మెల్లిగా చాకు తెరిచాను. అది నాదృష్టిలో అగ్నిక్కి కక్కే జిహ్వలా మెరిసింది. ఇదే మానవుడికి యుగయుగాలుగా జీవనాధారమైన మొట్టమొదటి సాధనం.

కాని మరుక్షణంలోనే ఈ యోచన భగ్నమై పోయింది. ఇది పొరపాటని చటుక్కున తెలిసివచ్చింది. అప్పటికే నా చెయ్యి మళ్ళీ జేబులోకి వెళ్లింది. అప్పుడు చేతికి తగిలిన వస్తువు అగ్గిపెట్టి. వెంటనే అగ్ని జ్వాలలు. కన్నులకు మిరుమిట్లు గొలిపాయి. ఉక్కుకంటె ప్రచండమైనది అగ్ని. అగ్ని హవ్యవాహనుడు.

మానవకోటికి ప్రాణాధారమైనవాడు. కాని మానవుడు తాకడానికూడా హడలిపోతాడు.

తరవాత మళ్లీ జేబులోకి చెయ్యి పోనిచ్చాను. సుద్దముక్కొచ్చింది. దీనితో కళాకారులు ప్రఖ్యాత చిత్రవర్ణలేఖకుల రచనలు పూబోడులు, అభిసారికలు జ్ఞాపకం వచ్చారు. ఆపైన రాగిడబ్బొచ్చింది. బ్రిటిష్‌చక్రవర్తి, రవి యస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం, పరిపాలన, ప్రభుత్వాలు, సామ్రాజ్యాలు, ప్రజలువ్యాపారం, పరిశ్రమలు అన్నీ జ్ఞాపకంవచ్చాయి. ఇవన్నీ వ్రాస్తూఉంటే పత్రికలు పట్టవు. కాని ఇవన్నీ నాజేబులోనుంచి శరపరంపరగా వచ్చిపడుతున్నాయి.

అయితే! ఒక్కటిమాత్రం నా జేబులో కనిపించలేదు. అది రైలుటిక్కట్టు.

[చెస్టర్‌టన్‌రచన ఆధారంగా]



# కాంగ్రెస్ పునర్నిర్మాణం

(14-వ పేజీ తరువాయి)

ట్రేడుయూనియన్ నాయకుడు ప్రభుత్వ విధానాలను విమర్శిస్తూ, కార్మికులకు కాంగ్రెసు చేసిన వాగ్దానాలను నెరవేర్చలేదు, పెట్టుబడిదార్లను నెత్తికెక్కించుకుంటున్నారన్నాడు. దానితో సర్దార్ పటేల్ తోకతొక్కిన తాచులా అయాడు. ఈ రెండేళ్లలో ప్రభుత్వం చేసిన కార్మిక శాసనాలను మరేదేశమైనా చేసిందా అని గద్దించాడు. ఎవడో వెనకకుర్చీవాడు అయితే పోనీలే అని ఊరుకొనేవాడిని. కాని నీ అంతటి నాయకుడే ఇలా అంటే ఎలా? ఇది క్షంతవ్యం కాదు అన్నాడు. ఆ మానవుడు మళ్లీ మాట్లాడలేదు.

కాని ఆ వాగ్దానాల సంగతిమటుకు ఎత్తలేదు.

'పారిశ్రామిక శాంతి' (1947 డిసెంబరు) సందర్భంలో ప్రభుత్వం ఈ వాగ్దానాలు చేసింది.

(1) సరసమైన కూలీ (*Fair Wages*)

(2) లాభాల్లో భాగం (*Profit Sharing*)

(3) గృహవసతి (*Improved Housing*)

వీటిలో మొదటి రెండూ అడుగున బడినయ్.

ఇక గృహవసతివిషయం ప్రభుత్వం ఇంకా ప్రకటనలు చేస్తూనే ఉంది. ఈ కార్మిక-వాగ్దానాలిలా అడుగునపడివుంటే, పెట్టుబడిదార్ల గొంతెమ్మకోరికలన్నీ ఎప్పటికి అప్పుడు తీరుస్తూనే ఉన్నారు. ఈ అసలువిషయమై సూటిగా మాట్లాడకుండా, కార్మికులపై, కార్మికనాయకులపై విరుచుకుపడ్డాడు పటేల్.

కాంగ్రెసు సంస్థగా చేసే తీర్మానాలకు, నిర్వచించే సందేశాలకు, ప్రభుత్వంగా అమలుజరిపే విధానాలకు సంబంధం నానాటికీ తగ్గిపోతోంది. ఈ వ్యత్యాసం కాంగ్రెసువారి స్తబ్ధతకు ముఖ్యకారణమవుతోంది.

ప్రభుత్వవిధానాలను సమర్థించాలా? లేక కాంగ్రెస్ తీర్మానాలప్రకారం చేయాలా?

కార్యవాదులకీ సందేహాలు అడ్డుతగులుతున్నయ్. అందువలన త్రిశంకుస్వర్గంగా ఉంది వీరి పని.

తర్వాత ఇంకొక ముఖ్యకారణం: ఉపన్యాసాలు ఉదాత్తంగా, గంభీరంగా చేయటంతప్ప, విషయాలను సమూలంగా రిపశీలించి, అవగాహనచేసుకొని, చర్చించుకొని, నిర్ణయాలకువచ్చే శిక్షణ కాంగ్రెసు వారిలో చాలామందికి లేదు. సత్యాగ్రహాలకు, పికెటింగుకు, జైళ్లకు తండోపతండాలుగా జనాన్ని పంపటంలో సిద్ధులయూరు - ఇది సామాన్యవిషయం కాదు. కాని విషయాలను పరిశీలించి, గ్రహించటంలో శిక్షణ ఇవ్వలేదు. ఈ లోపం ఇప్పుడు బాగా కనబడుతోంది.

ముఖ్యంగా రాజ్యాంగ, ఆర్థికవిషయాల్లో పెద్ద కాంగ్రెసునాయకులకు కూడా తగినంత పాండిత్యం, విమర్శనాశక్తి అలవడలేదు. ఇంక సామాన్యుల సంగతి చెప్పనక్కర్లేదు. అందువల్ల ప్రాంతీయ కాంగ్రెసువారికి దేశంలోని ఆర్థిక, తదితర విషయాలగురించి తగిన పరిజ్ఞానం లభించలేదు. ఇతరుల, ఇతర పార్టీలవారి విమర్శకు వీరు తగిన సమాధానమివ్వలేకుండా ఉన్నారు.

మామూలుగా గ్రామాల్లో కాంగ్రెసు వారి సూత్రం ఇది: 'పైన నెహ్రూ, పటేల్ ఉన్నారు. వాళ్లు ఏదిచేసినా మన మంచికే. కాబట్టి అనవసరంగా శంకిస్తూ, విమర్శలు చేయకండి' అని. కాని ఈ తారకమంత్రం ప్రజల్లో పారలేదు. పారదు.

పై విషయాలబట్టి ఈనాడు కాంగ్రెసు ప్రభుత్వాలకు, సంస్థలకు మధ్య సామరస్యం సిద్ధింపజేసే నిర్దిష్టకార్యక్రమం, లక్ష్యనిర్ణయం, ఏకైకఅభిప్రాయం లేవని; కాంగ్రెసువారు నిర్మాణకార్యక్రమం ఏమీ ఆచరించలేదని; కాంగ్రెసువారికి దేశసమస్యలకు సంబంధించిన విషయాలగురించి తగిన పరిజ్ఞానం లభింపజేసే శిక్షణ శిక్షితంగా లేదని తేటతెల్లమవుతోంది.

మళ్లీ చైతన్యంతో కాంగ్రెస్ పని చేయాలంటే, ఇదివరకటి అస్పష్టతీర్మానాలు, సిద్ధాంతాలబదులు ఇకనుంచైనా తమకున్న శక్తినిబట్టి, లక్ష్యంబట్టి ఆచరణసాధ్యమైన కార్యక్రమాన్ని స్పష్టంగా వివరంగా నిర్దేశించి, దానిప్రకారం కాంగ్రెస్‌ప్రభుత్వాలను, సంస్థలను పనిచేయమనాలి.

కాంగ్రెసువాదులకు శిక్షణాలయాలను సరైన పద్ధతులమీద ఏర్పరచి, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, పారిశ్రామిక, వ్యావసాయికవిషయాలగురించి, ప్రజాస్వామ్యంగురించి, ఇతర విషయాలగురించి క్షుణ్ణమైన



ఆసుపత్రి బిల్లువిషయం నువ్వు ఏమీ ఆదుర్దాపడకు. నువ్వు యింట్లో వున్నప్పటికంటె యిక్కడుంటేనే ఖర్చుతక్కువ.

తర్ఫీదు నివ్వటం అత్యవసరం. కాంగ్రెస్ నియమావళి, ఎన్నికల ప్రణాళిక, తీర్మానాలు ఏమిటో 100 కి 90 మందికి తెలియవంటే అతిశయోక్తి కాదు. ఈ సందర్భంలో ఒక ప్రముఖ కాంగ్రెస్‌నాయకుని హెచ్చరికను ఉదాహరిస్తాను. "చైనాలో చయాంగ్‌పార్టీ పోతే అరాచకమేనని బెదిరించేవారు. అది నిజంకాదని ఇప్పుడు తేలింది. అలాగా కాంగ్రెస్ పోతే కల్లోలం అని అంటున్నారు. ఈ జోస్యమూ అంతే కావచ్చు" అని.

కాంగ్రెస్ పోతే ఏమవుతుందీ అనే విషయం అటుంచి, కాంగ్రెస్ ఉన్నప్పటి సమస్యలను సరిగా పరిష్కరించుకొని, సంస్థను శక్తివంతం చేయాలి.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు వెళ్లిపోయాక కాంగ్రెసు ఐక్యసంస్థగా ఉంటుందన్నారు. కాదు అని తేలింది. కాంగ్రెసులో శుద్ధ గాంధీజీశిష్యులు, పెట్టుబడిదారీ సిద్ధాంతులు, మతశాంతి, ఐకమత్యం కోరే నెహ్రూ అనుచరులు, ఆర్. యస్. యస్. హిందూమహాసభతత్త్వాలను చాటుమాటున ఆమోదించే మతదురహంకారులు. నానాగోత్రాలవారు ఉన్నారు. ఇన్ని భిన్న, పరస్పరవ్యతిరేకఅభిప్రాయాలతో ఏ సంస్థ సరిగా పనిచేయలేదు. కాబట్టి ఈ అయోమయావస్థను తొలగించి కాంగ్రెస్‌లో వ్యతిరేకసిద్ధాంతాలకు, కార్యక్రమాలకు చోటులేకుండా, ఒక సుశిక్షిత రాజకీయ పార్టీలాగా పనిచేసేట్టు సంస్థను నిర్మించాలి. సభ్యులను శిక్షితులను చేయాలి.

---

# "కామీస్వతాంపశ్యతి"

(19-వ పేజీ తరువాయి)

బడ్డాడు. ఆమె మెల్లిగా సమాధానం ఇచ్చింది. నాకు వినిపించలేదు. వాళ్లిద్దరి మధ్యా రెండేజానలు ఎడం ఉంది. ఎదుట మగవాడున్నా వీడి కెంత సాహసం. కోతి మొహం వాడికూడా ఇంత కామ వికారం! అతనిలో పెంకితనం కనిపిస్తోంది నాకళ్ళకు! ఆమె చిఱునవ్వుతో, తియ్యగా మాట్లాడుతోంది. నాలో మాత్సర్యం ఉబికి వచ్చింది. కొన్ని దూషణవాక్యాలు బలహీనతవల్ల పళ్ల సందుల్లోనే నలిగిపోయాయి! కాని కోతిమొహమూ వాడూ వాడేమిటిలే అనిపించింది. మనస్సు శాంతించింది. ఒకడు పళ్లమ్ముకుంటూ కిటికీదగ్గరగా పోతున్నాడు. ఆమె "ఏయ్ అబ్బాయి" అంటూ కేకవేసింది. ఆ కంఠం గాలిలో కలిసిపోయింది. వాడు అలాగే పోతూన్నాడు. అవకాశం దొరికిందనుకుంటూ, ఆమె చేతిలోంచి డబ్బు లందుకోడానికి యత్నించాను. అంతలో అతనిచేయి పైసాలుమీద వ్రాలింది. నేను ఉలికిపడి, అతనిచేష్టలు గమనిస్తున్నా. తీసుకున్నాడు డబ్బులు. పండ్లతో తిరిగి వచ్చాడు. చిరునవ్వుతో ఆతనివంక చూస్తూ పళ్లు అందుకుంది. అంతటితో అతను పోనివ్వలేదు. దానిమ్మపళ్లు తాను కొని వద్దంటున్నా వినక ఆమె చేతిలో బలవంతాన పెట్టాడు. నాకు కోపం మించిపోయింది. దానితోపాటు నిరాశ భయం కలిగాయి. తన చేష్టలతో ఆమె హృదయాన్ని ఆకర్షిస్తున్నాడు. స్త్రీ, పురుషునిలోని అంతరంగిక సౌందర్యాన్ని చూచి, మోహితురాలౌతుందంటారు. ఇది జ్ఞాపకం రాగానే మనస్సు కలత పడింది. అతని వంక తీక్ష్ణంగా చూస్తున్నాం. నా చూపులోని భావం అతనికి అర్థమయ్యే ఉంటుందనుకున్నా. కాని అర్థం కానట్టు అతనలాగే నవ్వుతూ మాట్లాడుతున్నాడామెతో. క్షణక్షణానికీ నాకు గుండెల్లో భారం ఎక్కువై పోతోంది.

"ఇందండి. పుచ్చుకోండి పళ్ళు." అంటూ నవ్వుతో నాకు ఇవ్వడానికి చేయి చాపాడు. అతని నవ్వు పుండుమీద కారం జల్లినట్టయింది.

"వద్దండి. ఇప్పుడే తిన్నాను - మీరు ఈ బెంచిమీదకు వచ్చేయండి. వాళ్లిద్దరకు స్థలంచాలదు" - అతనితో పైకి నవ్వుతూ అన్నాను.

"ఫరవాలేదులెండి" - అందామె.

"మీకు కష్టంగా ఉంటుందని" - అన్నా నామెతో.

ఆమె పళ్లు ఒలిచి, తన పెట్టెలోంచి రెండు ప్లేట్లుతీసి, "తీసుకోండి." అంటూ ప్లేటులో పళ్లుపెట్టి ఇచ్చింది. నేను ఆమె మొహాన్ని దీనంగా చూస్తున్నానందాక, వెంటనే నాలో పోతూన్న శక్తి మళ్లా చేరినట్టనిపించింది. అదే బెదురు. అదే చిఱునవ్వు. ప్రేమ కలుషితం కాలేదు.

పడుకున్నామెకు దగ్గు ఎక్కువై లేచి కూర్చుంది. అతను - "అలా దగ్గుతున్నారేంటమ్మా?" - అని, అడిగాడు.

"నాలుగు దినాల్నుండి దగ్గు పట్టుకుంది బాబు" - అందామె.



గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారికి ఫిబ్రవరి 4, 5 తేదీలలో గుంటూరులో జరిగిన సన్మాన సందర్భపు చిత్రము. మొదటివరసలో కూర్చున్నవారు: జటావల్లభుల పురుషోత్తం, జమ్మలమడక మాధవ రామశర్మ, ఉప్పుటూరి వెంకటపున్నయ్య, తాడేపల్లి శంకరశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు, బులుసు రామమూర్తి, హనుమచ్ఛాస్త్రి, గుం. జి. కలెక్టర్, నిడుమోలు కనకసుందరం వినుకొండ సర్కిల్ ఇన్స్పెక్టరు సీతారామయ్య ప్రభృతులు.

"ఈమె నీ కేమవుతుందమ్మా?" - అడిగాడు.

"నా కూతురే బాబు"—

"చక్కని చుక్క. అమ్మాయిని చూస్తుంటే ఆనందం పట్టలేక పోతున్నాను. బండి దిగబుద్ధెయ్యడంలేదు..." విస్మయంతో అంటున్నాడు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇంత స్పష్టవాది, ధైర్యవంతుడు లేడనిపించింది. ఎదురుగా నేనున్నా. తల్లితోనే ఇలా మాట్లాడటం. కామార్తునికి పెద్ద చిన్న కనిపించదు, సిగ్గు భయం ఉండదన్నారు పెద్దలు. తగిన శాస్తి జరుగుతుందని అతని మాటలు వింటున్నా... ఇవే కళ్లు! ఇదే సుంద్రనిముఖం. అదే నవ్వు. అతని కళ్లలో నీళ్లు కనిపించాయి. "రెండే మాసాలయింది తల్లీ. నా తోడబుట్టువు. మమ్మల్ని విడిచి పోయింది." - అంటూ అతడు తువాలుతో కళ్లు మూసుకున్నాడు. దుఃఖం కంఠాన్ని అడ్డేసి బయటకు వచ్చేసింది.

నా హృదయం ఒక్కసారిగా ఝల్లుమంది. నా హృదయభావాన్ని, బలహీనతను కనిపెట్టి ఉండడు గదా? బలహీనత పూర్తిగా బయటపడకముందు తన రహస్యాన్ని చెప్పేసి నా మానం దక్కించాడు. సిగ్గుతో తలవంచుకున్నాను. ఆమె తల్లి మళ్లా నిద్రపోయింది.

ఆయన దిగవలసిన స్టేషను వచ్చేసింది. అతని హృదయం ఆమెను విడిచిపెట్టడానికి బాధపడ్తోంది. ఆమె తలను ప్రేమతో నిమురుతూ, నన్ను అభినందిస్తూ - "ఇంటికి చేరగానే అమ్మాయి క్షేమాలతో ఉత్తరం తప్పక రాయిబాబు. నా ధ్యానం మీమీదే ఉంటుంది. ఈశ్వరుడు నా సోదరిని ఈ రూపంలో ప్రసాదించాడు. మిమ్మల్నిద్దర్ని చూడ్డానికి వారం రోజుల్లో వస్తాను"... అంటున్నాడు. నేను, ఆమె నివ్వెరపోయి చూస్తున్నాం. ఆమె సమాధానం చెప్పలేక పోతోంది. తొందరగా దిగి వెళ్లిపోయాడు. మా ఇద్దరి చూపులూ ఒకసారి కలుసుకున్నాయి. అతని భావానికి ఫక్కున నవ్వుకున్నాం. అతని దృష్టి, పైన పడుకున్న వ్యక్తిమీదకు పోనే లేదు.

ఇంతవరకూ నాకో సందేహం ఉండిపోయింది. ఆ మగమనిషి ఈ ఆడవాళ్ళిద్దరికీ ఏం కావాలి? వయస్సు చాలా ఉందనిపిస్తుంది. పెద్దామె అతని భార్య అయి ఉంటుంది. ఈమె కూతురయి ఉంటుందనుకున్నాను మొదట. కాని అదికాస్త ఆ పెద్దామె ఆ ప్రయాణీకునితో "నాకూతురు" అని చెప్పింది.

ఆమె నాకు తన హృదయంలో స్థానం యిచ్చినదీ లేనిదీ స్పష్టంగా తెలుసుకోవాలనే ఇచ్ఛ కలిగింది. స్టేషనులో ప్లాట్‌ఫారంమీద బుర్ర గోక్కుంటూ ఇటూ అటూ తిరుగుతూ ప్రేమపరీక్షకు ఉపాయం ఆలోచిస్తున్నా. ఇంతలో ఓ ఊహ తట్టింది. సాయంకాలం స్టేషనుకు వస్తూంటే ట్రంకు గీసుకుపోయి చూపుడువేలికి గాయమయింది. రక్తం కారుతోంటే తడిగుడ్డ చుట్టేశాను. ఆ తడిగుడ్డ అలాగే ఉంది. దాన్ని విప్పేసి దూరంగా పారేశాను. గాయం పచ్చిగానే ఉంది!

లోకంలో ఒక వస్తువుమీద గాఢంగా ప్రేమ ఏర్పడితే, అది చేజారిపోయినా, ప్రమాదానికి గురిఅయినా ప్రాణి గిలగిల్లాడుతుంది. ఆ దిగులుపాటే ఆమె ముఖంలోనూ మాటల్లోనూ చేష్టల్లోనూ చూడాలనే ఆశ కలిగింది.

బండి కదిలి నాలుగుగజాలు పోయినతరువాత ఎక్కాను. "—మీ రింతవరకు ఎక్కడుండిపోయారు?" అన్నదామె. లోలోన తృప్తిపడ్డాను. చిరునవ్వు నవ్వాను.

తరవాత వేలు చూసి "ఏం దెబ్బ తగిలిందా?" అని అడిగింది.

"అబ్బె! ఏమీ లేదు, ఇందాకా గీసుకుపోయింది" అన్నాను.

"అయ్యోపాపం గుడ్డచుట్టండి" అని చేతిరుమాలు తీసిఇచ్చింది. చుట్టబోయినట్లు చుట్టి నెప్పి నటించి అంతలోనే మానేశాను. ఒక్కక్షణం ఆమె నావంక చూసి ఏదో యోచించి గుడ్డ తను తీసుకొని మరచెంబు నీళ్లలో ముంచి మెల్లిగా నా వేలుకి చుట్టింది.

ఉంగరాలు తిరిగిఉన్న శిరోజాల సౌందర్యాన్ని ఆలోకిస్తున్నా. కట్టడం అయిన తరవాత నేను "మీకు శ్రమ కలిగించాను" అన్నా.

నిండుగా నవ్వుతూ "ఇంతమాత్రానికేనా" అన్నది. ఆ నవ్వునక ఇంత చలాకీ యింత మాధుర్యం ఉన్నాయని ఇప్పుడు తెలిసింది. ఇద్దరిమధ్యా చనువు ఏర్పడ్డానికి ఆ ప్రయాణీకుడే కారణం! ఆపైన మధురమైన ఆలోచనల్తో చంద్రుని లోకి ఎగిరి

పోయాను. ఏవేవో ఆలోచనలు వస్తున్నాయి. ఏవో సన్నివేశాలు కల్పించుకుని ఊహిస్తున్నాను. ఆనందంతో తన్మయత్వం కలిగింది. ఇంకా ఆమెవంక చూడ్డానికి సంకోచం తీరిపోయింది. ఆమెకూడా ఏదో భావతరంగాల్లో పడి కొట్టుకుపోతున్నట్లుంది. ఆమె ఏ మాలోచించుకుంటూందో కొంత సేపు ఊహిస్తూ గడిపాను.

ఇంతలో పైబెర్తుమీద అలికిడయింది. చటుక్కున నా ధ్యానం అటు పోయింది. పడుకున్న వ్యక్తి లేచి పరుపు చుట్టేస్తున్నాడు. నిద్రకళ్లతోనే క్రిందికి దిగుతూ, క్రింద పడుకున్న ఆమెకాలిని తొక్కాడు. ఆమె ఉలికిపడి లేచింది.

"మీ రిద్దరు మేల్కొనే ఉన్నారేమిటి?" అని అడిగా డతను.

"మరేనండీ" అన్నాను వినయంగా.

"నిద్ర ఆపుకోడం నాతరం కాదు."

"ఒక్కొక్కరి శరీరతత్వం అలా గుంటుంది"

కిందికి దిగివచ్చి కూచున్నాడు. నా ఊరు పేరు వంశం మొదలైనవన్నీ అడిగి తెలుసుకున్నాడు. తెలుసుకున్న తరవాత అతనికి నాపట్ల ఎక్కడ లేని ఆదరం అభిమానం కలిగాయి. ఒకే కులం. ఎక్కడో బాంధవ్యంకూడా కలిసింది.

"మీ కింకా వివాహం కాలేదా?" అని అడిగాడు.

"లేదండీ" అంటూ చిరునవ్వుతో ఆమె వంక చూశాను.

ఆమెపెదవులమీద చిరునవ్వు తాండవిస్తోంది. నా సమాధానంతో ఆమెహృదయం ఉప్పొంగి ఉంటుం దనుకున్నా. నేను మహా వినయంతో అతని ప్రశ్నలకు జవాబు లిస్తున్నా.

"ఏం చదువుకున్నారు!"

"బి. ఏ."

"మన అమ్మాయిగూడా బియ్యే చదివింది కాదూ?" - అడిగిందా పెద్దామె అతణ్ణి.

"లేదు. ఇంటర్మీడియెట్" - అన్నాడతడు. నేను ఆమెముఖంవంక చూశాను. ఆమె ఇంత చదువుకునికూడా ఏమీ ఎరగనట్టు ప్రవర్తించింది. ఆమెపెంకితనానికి ఆమెమీద అదో వింతకోపం కల్గింది! ఆమె అలాగే చిరునవ్వు నవ్వుతూంది.

తరవాత కొంతసేపు నిశ్శబ్దం. అతను కొంతసేపటికి తటపటాయిస్తూ "మిమ్మల్ని ఓ విషయం అడగాలని ఉంది" - అన్నాడు

"అడగండి! దాని కేమిటి?"

"మా అమ్మాయిని చదివించడంచే అది పూర్తి అయ్యేవరకూ పెళ్లి చేయడానికి వీల్లేక పోయింది. కిందటేడే బి. ఏ. పాసయింది. వరునికోసం అహోరాత్రాలు తిప్పలు పడుతున్నాం. ఎదిగినపిల్లకి సంబంధం కుదరడం కష్టంగా ఉంది. మీకు మా అమ్మాయి నివ్వాలని..."

మనుష్యుడు నిర్మించుకున్న ఆకాశసౌధాలు స్థిరంగా ఇలా నిలవగలగడం అరుదు. హృదయం ఆనందోత్సాహాలతో కేరింతలు కొట్టింది. అది అణుచుకుంటూ "మిమ్మల్ని కలుసుకున్నందుకు సంతోషం. తప్పకుండా ఈ విషయాన్ని ఆలోచిద్దాం" అన్నాను.

అతను లేచి కాఫీ తెప్పించాడు. ఆమె తన చేతుల్తో ముగ్గురికి కాఫీ అందించింది. ఆ తరవాత చనవు అధికమయింది. ఆమె నవ్వుతూ ఏవేవో మాట్లాడ్డం ఆరంభించింది. సంభాషణసమయంలో ఆమెపేరు 'హంసముఖి' అని తెలిసింది.

"మీ ఊరికి వెళ్లి రేపే, మా ఊరు రండి!" - అన్నాడతను.

"తప్పకుండా రా బాబు" - అనిందా పెద్దామె.

వాళ్లు పోవలసిన స్టేషను వచ్చేసింది. బండి కదలడానికి టైమయిపోవచ్చింది. అతను కూలివాళ్లతో వివాదపడుతున్నాడు కొంచెం దూరంలో. "—హంసముఖీ! వెళ్లి తమ్ముణ్ణి పిల్చుకురా!"—అంటూ తల్లి ఆమెను పంపించేసింది.

"అ దేం పేరండీ" అన్నాను పెద్దామెతో.

"అమ్మా యిది చిరునవ్వు మొహం బాబు! వాళ్ళతండ్రి బిడ్డను హంసముఖీ అని ప్రేమతోటి పిలుస్తుం డేవారు. అసలుపేరు కమల."

"ఆయన మీ తమ్ముడా?"

"అవును, స్వంతతమ్ముడు"

"కమలకు ఏమవుతాడు?"

"భర్త, బాబు!"—

"భర్తా!...?"

"అవును, బాబు! బిడ్డ తండ్రిపోయిన తరువాత తమ్ముడిదగ్గర చేరాం. అమ్మాయిని కూడా వాడికే ఇచ్చాను."

"అయితే ఆయనకి పెళ్లి కావలసిన కూతురుందా?" అన్నాను. సన్నగిల్లిన గొంతుతో.

"మొదటిభార్య కూతురు. పేరు లలిత. పద్దెనిమిదేళ్లు..."-ఆమె చెప్తూపోతోంది నేను జారిపోతున్న గుండెల్ని అదిమిపట్టుకొని, కూలిపోయిన ఆకాశసౌధాలక్రింద గిలగిలలాడుతున్నా.

ఇంతలో వాళ్లిద్దరూ వచ్చారు. కమల చిరునవ్వుతో ఆపేక్షతో నావంక చూసింది.

"అమ్మాయిని చూట్టానికి రేపు తప్పక రండి?"—అన్నా డతను.

"నమస్కారమండి! రేపు తప్పకుండా రావాలి. మీకోసం ఎదురుచూస్తూఉంటాం. మా లలితని చూద్దురు గాని" అంది కమల.

వాళ్లు వెళ్లిపోయినతరవాత నాలో పశ్చాత్తాపం పొంగివచ్చింది. హృదయంలోని మాలిన్యమంతా కన్నీళ్ళతో కడిగేసింది. ఓ దీర్ఘనిశ్వాసంలో గాలిమేడలన్నీ ఎగిరిపోయాయి? "నీ చిఱునవ్వులోని రహస్యాన్ని ముందే నాకెందుకు చెప్పావు కావు" అనుకున్నా. ఆ చిరునవ్వు ప్రకృతి ప్రసాదించినది. నావంటివాళ్ళను శిక్షించడానికి కాబోలు! మహాకవి కాళిదాసువచనం "కామీ స్వతాం పశ్యతి" మతికి వచ్చింది. బండి కొండలమలుపులోకి పోయింది.

---

మన రాష్ట్రం, మన దేశం:

# హైదరాబాద్ సందిగ్ధావస్థ

హైదరాబాద్ సంస్థానవిభజనకు అన్ని రాజకీయపక్షాలూ ఆందోళన చేస్తున్నాయి. ఆంధ్రరాష్ట్రనాయకులు విశాలాంధ్రనిర్మాణానికి తీవ్రఆందోళన ప్రారంభించారు. తెలంగాణా ప్రాంతకాంగ్రెస్ హైదరాబాద్‌ను విభజించి తెలంగాణాన్ని సర్కారు రాయలసీమజిల్లాల్తో చేర్చి విశాలాంధ్రరాష్ట్రం నిర్మించాలని ఇదివరకే తీర్మానం చేసింది. హైదరాబాద్‌ని విభజిస్తేగాని తెలంగాణాలో కమ్యూనిస్టు ముప్పును అరికట్టటం సాధ్యపడదని కాంగ్రెస్ నాయకులు స్వామిరామానందతీర్థగారు పలుమార్లు చెప్తున్నారు. కొందరు కాంగ్రెస్ సంస్థలోని కక్షలు భాషారాష్ట్రనిర్మాణంతోగాని తొలగిపోవంటున్నారు. నిర్జీవస్థితిలో ఉన్న కాంగ్రెస్ సంస్థను పునరుజ్జీవనం చెయ్యాలంటే సంస్థ ప్రజలకు సన్నిహితంగా ఉండాలనీ, కాంగ్రెస్ పరిపాలకులు ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉండాలనీ, అందువల్ల భాషారాష్ట్రనిర్మాణమూ, ప్రాంతీయభాషలో పరిపాలనానిర్వహణమూ అవసరమంటున్నారు. అయితే భాషారాష్ట్రాల నిర్మాణంతో కక్షలు తొలగిపోతాయనేది అసంభవం. కక్షలు తొలగిపోవాలంటే ప్రాంతీయ కాంగ్రెస్ నాయకులు ప్రజలకు సన్నిహితులై వారి సమస్యల్ని అర్థం చేసుకుని పరిష్కరించడానికి నడుముకట్టినప్పుడే కొంతవరకూ సాధ్యపడగలదు. అప్పుడు కక్షలున్నప్పటికీ కేవలం వ్యక్తుల తగాదాలుగా ఉండిపోడానికి అప్పుడవకాశం ఉండదు. ప్రజలు తమ వ్యవహారాల విషయమై మరింత శ్రద్ధ వహించగలుగుతారు.

కాని ఈవిషయమై కేంద్రప్రభుత్వాన్ని ఆంధ్రులు విశ్వసించవచ్చుననీ, ఆంధ్రులికి న్యాయం చేకూర్చి రాష్ట్రాన్ని ఇవ్వగలరనీ వారు వాగ్దానభంగం చెయ్యరనీ ప్రకాశం గారు, శ్రీకాళేశ్వరరావు గారు మొదలైనవారు పదే పదే చెప్తున్నారు.

కాని ఈ వాగ్దానాలపట్ల అంతగా ఎవరికీ విశ్వాసం కలగడంలేదు. హైదరాబాద్ విషయమై కేంద్రప్రభుత్వ అభిప్రాయం బొత్తిగా బోధపడటంలేదు.

మార్చిలో హైద్రాబాదు రాజ్యాంగ పరి

(40 వ పేజీ చూడుడు)



జమ్మికుంటలో (కరీంనగర్ జిల్లా) స్వామీజీ గారు గాంధీజీ శిల్పప్రతిష్ఠాపన చేశారు.

నేటి ప్రపంచం:

# రష్యా చీనాల మైత్రి



మార్షల్ స్టాలిన్

చీనా రష్యాల మధ్య 30 ఏళ్ల మైత్రి ఒడంబడిక జరిగింది. దాదాపు రెండుమాసాల సమాలోచనలు పరస్పరాదరగౌరవాలతో మావోసేటుంగ్ స్టాలిన్‌ల మధ్య సమాధానం కుదిరింది. రష్యా 300 మిలియన్ల డాలర్లు చీనాకు ఋణమివ్వడానికి ఏర్పాటయింది. జపాన్‌వల్లగాని ఏ ఇతర ప్రాచ్యరాజ్యం వల్లగాని రష్యా చీనాలలో ఏ ఒకదేశం పైన దురాక్రమణ సంభవించినా రెండవదేశం సహాయం చెయ్యాలని నిర్ణయించబడింది.

మంచూరియా నుంచి తవ్వి తీసుకుపోయిన యంత్రసామగ్రిని తిరిగి పంపించడానికి రష్యా అంగీకరించింది. మంచూరియా రైల్వేను చీనాకు స్వాధీనపరచడానికీ, పోర్టు ఆర్థర్ రేవును చీనాకు వశపరచడానికీ డైరెన్ రేవుపై తమ హక్కుల్ని విడిచిపెట్టడానికి రష్యా అంగీకరించింది. అయితే జపానుతో సంధిజరిగేవరకూ, వీలైతే 1952 వ సంవత్సరానికి ఒప్పగించడానికి రష్యా అంగీకరించింది. జపాన్‌తో సంధిఒడంబడికకు, ఉభయదేశాలూ యత్నించగలవు.

ఈ ఒడంబడికపత్రంపైన రష్యాతరఫున వైషిన్స్కీ, చీనాతరఫున చౌ ఎన్ లై సంతకాలు చేశారు. ప్రపంచంలో నాలుగో వంతు జనాభా గల రెండుదేశాల మధ్య గాఢమైత్రికి పునాది వెయ్యబడింది.

ఈ ఒడంబడిక ప్రపంచచరిత్రలో ప్రధానమైన ఘట్టాలలో ఒకటని చీనాప్రధానమంత్రి చౌ అన్నాడు. దీనివల్ల ప్రాచ్యదేశాల్లోనూ, ప్రపంచంలోనూ ప్రజలకు శాంతి న్యాయం చేకూరగలవని చౌ అన్నాడు.

అయితే ఈసంధివల్ల చీనాప్రజలకు కలిగే ప్రయోజనం శూన్యమనీ, చీనాదేశ సమస్యలు పరిష్కారం కావడానికి ఎలాంటి యత్నం జరగలేదనీ అమెరికన్ విదేశాంగ కార్యదర్శి డీన్ ఎచిసన్ అన్నాడు. 300 మిలియన్ల డాలర్ల ఋణం అయిదేళ్లలో ఇస్తే చీనాకి బొత్తిగా చాలదన్నారు. చియాంగ్ ప్రభుత్వం సాధించలేకపోయిన ఆహారసమస్య ఆర్థికదుస్థితులను కమ్యూనిస్టు ప్రభుత్వంకూడా సాధించలేదన్నారు. ఇప్పటికే కొన్ని ప్రాంతాల్లో దుర్భిక్షం వ్యాపించినట్లు వార్తలు వస్తున్నాయి.

ప్రకటించబడిన ఒడంబడిక నియమాలే కాక మరేవో రహస్యనియమాలు కూడా ఉండవచ్చని ఎచిసన్ అన్నాడు. తూర్పు ఆసియాలో కమ్యూనిజంవ్యాప్తినిమిత్తం ఆయాదేశాల కమ్యూనిస్టుపార్టీలు అనుసరించవలసిన కార్యక్రమాలనూ, చీనా రష్యాలు ఆదేశాల పార్టీలకు తోడ్పడవలసిన విధానమును మావో, స్టాలిన్‌లు నిర్ణయించి ఉండవచ్చునని పాశ్చాత్యపత్రికలు ఊహిస్తున్నాయి.

చీనా రష్యాలమధ్య సహకారస్నేహాలు ఆట్టే కాలం కొనసాగవనీ చీనాలో క్షామం త్వరలోనే సంభవించకతప్పదనీ, చీనాలోనే అశాంతి చెలరేగే అవకాశం ఉన్నదనీకూడా అనేకులు అంచనా వేస్తున్నారు.

## ఇండోచీనా:

ఇండోచీనాలో రిపబ్లికన్ ప్రభుత్వాన్ని రష్యా చీనాలు గుర్తించాయి. బావోదాయ్



మావో సేటుంగ్

ప్రభుత్వాన్ని బ్రిటన్ అమెరికాలు గుర్తించాయి. భారతదేశం ఎవరి ప్రభుత్వాన్నీ గుర్తించలేదు.

ఇండోచీనాలోని మూడు రాజ్యాల్లోనూ (లావోస్, కాంబోడియా, వియత్‌నామ్) వియత్‌నామ్‌లో కొంతప్రాంతంలో మాత్రమే రిపబ్లికన్ ప్రభుత్వం ఉంది. వియత్‌నామ్ మిగతా ప్రాంతంలో బావ్‌దాయ్ ప్రభుత్వం పరిపాలిస్తోంది. వియత్‌మిన్ రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ హోచిమిన్ త్వరలో రష్యా వెడుతున్నాడు. చీనాతోవలెనే వియత్‌మిన్‌తోకూడా రష్యా ఒక మైత్రిఒడంబడికను చేసుకోవచ్చును. తరువాత చీనాతోకూడా ఒడంబడికయత్నం జరుగవచ్చును. అప్పుడు డా॥ హోచిమిన్ ప్రభుత్వానికి ఇంకా విరివిగా చీనా రష్యాలనుంచి ఆయుధబలసహాయం లభించే అవకాశం కలుగుతుంది.

వియత్‌నామ్‌లో శాంతిస్థాపనకు ఫ్రెంచి బలాలకు ఎంత ఆయుధసామగ్రి, ధనసహాయం అవసరమో వెంటనే తెలియపరచవలసిందని అమెరికా ఫ్రెంచిప్రభుత్వాన్ని అడిగింది. ఇంతవరకూ ఫ్రెంచిప్రభుత్వం తమ కెంత సహాయం కావాలో తెలపలేదు. అమెరికన్ ప్రభుత్వం సహాయం పంపడానికి తొందరపడుతోంది.

వియత్‌నామ్‌తోపాటు సయాం, దక్షిణ కొరియా, ఫిలిప్పైన్స్, మొదలైన ప్రాంతా

(39 వ పేజీ చూడుము)

# వ్యాపారదక్షత

(కల్పిక)

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

మా రాఘవయ్య మామ చూస్తుండగా ఎంత పారిశ్రామికుడైనాడు! ఎంత పెద్దమేడ కట్టించాడు! ఎన్నిలక్షలు సంపాయించాడు!

ఇప్పుడాయన వేదాంతం మొదలుకొని సినిమాకళవరకూ దేన్నిగురించన్నా మాట్లాడగలడు. ఏ విషయం మాట్లాడినా ఆ విషయంలో చెయ్యితిరిగినవాళ్ళే నోరు తెరుచుకు వింటారు.

మా మామసంగతి నాకెవరూ చెప్పక్కర్లేదు. ఆయన మున్సిపలూపాయల ఉద్యోగం కోసం అడ్డమైన కాళ్ళూ పట్టుకోవటం నే నెరుగుదును. ఆయన బియ్యంవర్తకం పెట్టి దివాలాతీయటం నే నెరుగుదును. దివాలా తీసింది వర్తకమేగాని, మా మామ కాదు. వర్తకం దివాలాతీయటం, అతివిచిత్రమైన సంఘటన. ఇరవై ఏళ్లు అంతులేని లాభాలు ఆర్జించిపెట్టిన వ్యాపారమైనా సరే ఒక ఏడు తగిన లాభాలివ్వకపోయినా, ఇక ఆ వ్యాపారంలో లాభాలకు ఎక్కువ అవకాశం లేని పరిస్థితి ఏర్పడినా అది దివాలా తీస్తుంది.

మా మామ వ్యాపారంలో లాభాలు చేశాడు. కాని అవి ఎట్లా వచ్చిందీ ఆయనకు తెలీదు. అదంతా ఆయనగుమాస్తా చూసేవాడు. ఒక వంక వ్యాపారంలో లాభాలు తీస్తున్న రోజుల్లోనే మా మామయ్యకు బజారుకుపోయి టోపీ పడకుండా గజం వల్లుగుడ్డ తీసుకురావటం చాతకాదు.

"మీ మామయ్య బజారులోకి అడుగుపెట్టగానే షాపుల వాళ్ళంతా టోపీలు పైకి తీస్తార్రా, రాముడూ" అనేది మా సుందరమ్మత్తయ్య.

పరిశ్రమల్లో ప్రవేశించటానికి డబ్బున్నది; వ్యాపారంలో సంపాదించినది. కాని మా రాఘవయ్యమామకు పరిశ్రమంటే ఏం తెలుసు? అందులో ఆయన ఎట్లా లాభాలు చేశాడు? ఈ విషయం నా కాశ్చర్యం వేసేది. మామామ అకస్మికంగా తెలివిగలవాడైనాడంటే నేను నమ్మలేదు.

"ఏం, మామా? ఏమిటి నీ రహస్యం? ఈ పరిశ్రమలో నువు టోపీపడలేదా" అన్నాను.

"పడకేంరా? నా తెలివితక్కువ చూసి పనికిమాలిన యంత్రాలన్నీ నాకు అంటగట్టి మధ్యవాళ్లు చాలా దోచారు. పదివేల ఖరీదు చేసేదానికి ఇరవైవేలు ఖర్చయింది." అన్నాడు మామామ.

"మరి ఇట్లా పైకి ఎట్లా రాగలిగావు?" అన్నాను.

"ఆ కిటుకు నువే చెబితివి కాదుట్రా?"

నాకు చెప్పలేని ఆశ్చర్యం వేసింది.

"ఏం చెప్పాను?" అన్నాను.

"పారిశ్రామికుల నిజమైన లాభాలు కార్మికులశ్రమ అపహరించటంద్వారా వస్తాయని నువు చెప్పలేదూ?"

నాకు జ్ఞాపకంలేదు. చెప్పానేమో!

"నాకదేమంత కష్టంగా కనిపించలేదు." అన్నాడు, అమాయకుడు, మా రాఘవయ్య మామ!

---

# నేటి ప్రపంచం

లకు కూడా సహాయం చెయ్యడానికి అమెరికా సిద్ధంగా ఉంది.

తూర్పు ఆసియా దేశాలలోని అమెరికన్ రాయబారులందరూ బాంకాక్‌లో అమెరికన్ విదేశాంగశాఖ ఉపకార్యదర్శి డా॥ జరిప్ జెసప్ అధ్యక్షతకింద సమావేశమై పరిస్థితుల్ని పరిశీలించారు. కమ్యూనిజం వ్యాప్తి నరికట్టడానికి ఒక కార్యక్రమాన్ని అమెరికన్ విదేశాంగ కార్యాలయానికి సూచించారు. తూర్పుఆసియా దేశాలకు ఆయుధపరికరాల సప్లై. ఆర్థికసహాయం చెయ్యడానికి కొన్ని సూచనలు చెయ్యబడినాయి.

కామన్వెల్తులోని ఇండియా, పాకిస్తాన్, సింహళాలకు, మలయాకు చెయ్యవలసిన సహాయంగురించి కొలంబోసమావేశం చేసిన నిర్ణయాలను అమలు జరపడానికి ఈ రాయబారుల సమావేశం నిర్ణయించింది.

సైనికంగా కూడా అమెరికా తన నౌకాబలాన్ని పసిఫిక్ మహాసాగరంలోనే అధికంగా కేంద్రీకరించాలని ఆసియాపర్యటించిన అమెరికన్ సైనికాంగప్రధానులు నిర్ణయించారు.

యూరప్‌లో కమ్యూనిస్టుల్ని ప్రతిఘటించడంలో గ్రీస్‌లో బలాబలాలు పరీక్షించుకోవడం జరిగింది. అలాగే ఆసియాలో బలాబలాలు పరీక్షించుకోడానికి ఇండోచీనా తగిన ప్రదేశమని నిర్ణయించబడింది. నార్వే, పశ్చిమజర్మనీ, గ్రీస్, టర్కీ, పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, ఇండియా, నేపాల్, సయాం, ఇండోచీనా, మలయా, ఫిలిప్పైన్స్, జపాన్ దేశాల్లో అనగా కమ్యూనిస్టుదేశాల చుట్టూ గల దేశాలలోకి కమ్యూనిజం ప్రవేశించకుండా కాపాడ్డం అమెరికా ప్రధానాశయం.

ఇప్పుడు ఈ దేశాల్లో కెల్ల ఇండోచీనాలో ఇరుపక్షాలకూ సంఘర్షణ ఏర్పడింది. ఒక పక్షాన్ని గెంటెయ్యాలని మరొకపక్షం యత్నిస్తోంది. మొత్తానికి ఇండోచీనా యుద్ధరంగమయ్యే ప్రమాదం ఆసన్నమయింది.

[సూర్యనారాయణ]

---



షేక్ బేగంసాహెబ్

హరికథా కాలక్షేపములు చేయుటలో మంచిప్రావీణ్యత సంపాదించి హైదరాబాదు ప్రాంతంలో హిందూ మహమ్మదీయ ఐక్యత కొరకు ప్రచారంచేస్తున్న మహమ్మదీయ బాలిక. నాట్యకళా ప్రావీణ్యతకూడా వున్నది. ఈమెను 'బేబీరాణి' అనికూడా పిలవటంకద్దు.

# మనరాష్ట్రం మనదేశం:

(16-వ పేజీ తరువాయి)

పత్సభకు ఎన్నికలు జరపాలని ఇదివరకు నిర్ణయించబడింది. భారత రిపబ్లిక్‌లో హైదరాబాద్ చేరికను ఆమోదించడానికి మాత్రమే ఈ పరిషత్తు ఎన్నుకోబడుతుందనీ, ఈసభను శాసనసభగా మార్చబోరనీ, ప్రజాప్రభుత్వ నిర్మాణానికి ఈ ఎన్నికలకూ ఎలాంటి సంబంధం ఉండబోదనీ కేంద్రప్రభుత్వం హైదరాబాద్ నాయకులకు స్పష్టంగా చెప్పారట.

పరిషత్తును శాసనసభగా మార్చడానికి నూతనరాజ్యాంగనిబంధనల ప్రకారం ఆంక్ష పెట్టబడిందట. అయితే ఇన్ని మాసాలుగా నియోజకవర్గజాబితాలను తయారు చెయ్యడానికి పెట్టిన ఖర్చు, జరగబోయే ఎన్నికల ఖర్చు ఒక్క సమావేశం కోసమా? ప్రజాప్రతినిధుల పరిపాలనకోసం హైదరాబాద్ ప్రజలు తహతహ లాడుతున్నారు. భారతప్రభుత్వం పంపిన ప్రభుత్వోద్యోగుల పట్ల హైదరాబాద్ ప్రజల్లో అసంతృప్తి కలుగుతోంది.

హైదరాబాద్‌ను విభజించబోరని ఒకవంక కేంద్రనాయకులు ప్రకటిస్తున్నారు. మరొకవంక ఎన్నికలు మార్చిలో జరుగబోవనీ, ప్రజాప్రతినిధుల ప్రభుత్వాన్ని స్థాపించడానికి ఇంకా వ్యవధి పట్టుతుందనీ వార్తలు వస్తున్నాయి. రెండువిధాలా కాకుండా హైదరాబాద్ ప్రస్తుత స్థితిలో ఎంతకాలం ఉండాలని కేంద్రనాయకుల అభిప్రాయం? ఈ విషయాన్ని త్వరలో స్పష్టపరచకపోతే హైదరాబాద్‌లో పరిపాలనావ్యవహారాలు క్లిష్టతరం కాక తప్పదు. హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్‌లో కక్షలున్నమాట నిజమే. హైదరాబాద్ కాంగ్రెస్ దుస్థితిలో పడిపోయినమాట నిజమే. కాని ఈనాడు ఈకక్షలూ దుస్థితీ లేని ప్రాంతం ఎక్కడుంది? కక్షలున్నాయని మిగతా ప్రాంతాల్లో ప్రజాప్రతినిధుల ప్రభుత్వాలను తొలగించారా? కాంగ్రెస్ కక్షలు యావద్దేశపరివ్యాప్తమైనవి. వాని పరిష్కారం కాంగ్రెస్ సంస్థ పునర్నిర్మాణంతో గాని సంభవించదు. కక్షల వంకబెట్టి హైదరాబాద్ భవితవ్యాన్ని నిర్ణయించడంలో జాప్యం చెయ్యరాదు. హైదరాబాద్ సంస్థానాన్ని విభజించి సమీపభాషారాష్ట్రాలతో చేర్చాలని కాంగ్రెస్‌వాదులు, సోషలిస్టులు, కార్మిక నాయకులు అందరూ కోరుతున్నారు. కేంద్రనాయకులు ఎంత త్వరగా హైదరాబాద్ భవిష్యత్తును నిర్ణయిస్తే అంత సులువుగా కమ్యూనిస్టుప్రమాదాన్ని నివారించవచ్చును. రెండుకక్షుల మధ్యనూ సమాధానం కుదరనంతమాత్రాన భారతరిపబ్లిక్ పార్లమెంటులో హైదరాబాద్‌కు ప్రాతినిధ్యం ఇవ్వకపోవడం న్యాయం కాదు. హైదరాబాద్ ప్రతినిధుల్ని పార్లమెంటుకి పంపే యోచనను కేంద్ర మంత్రివర్గనాయకు లిప్పుడు మానుకున్నారని తెలుస్తోంది. సమస్యల్ని పరిష్కరించకుండా ఎప్పటికప్పుడు వాయిదా వెయ్యడం మేలు కాదు. ఇప్పుడు పరిష్కరిస్తే ఏమి సంభవిస్తుందో నని భయపడి వెనుకంజ వెయ్యడం నాయకత్వలక్షణం కాదు సరికదా పరిస్థితులు మరింత క్లిష్టమై పోగల ప్రమాదం ఉంది.

## చెన్నరాష్ట్రంలో ఆంధ్రుల స్థితి:

చెన్నరాష్ట్రశాసనసభలో గవర్నరు ప్రసంగంపైన చర్చ జరిగింది. రాష్ట్రపరిపాలనలో ఆంధ్రదేశానికి జరుగుతున్న అన్యాయానికి విచారం ప్రకటిస్తూ శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు సవరణతీర్మానం ప్రతిపాదించారు. విభజనసంఘంవారు తయారుచేసిన లెక్కల్ని బట్టి ప్రభుత్వోద్యోగాలలో నియామకంలోనూ, అభివృద్ధిప్రణాళికల నిర్వహణలోనూ ఆంధ్రులకు జరుగుతున్న అన్యాయం అందరికీ కళ్లగట్టింది. కాని మంత్రివర్గంలోని తెలుగుమంత్రులికి మాత్రమే అందులో అన్యాయం ఎక్కడుందో బోధపట్టం లేదు. ఉద్యోగాల్లో తెలుగువారెందుకు ఇంత తక్కువగా ఉన్నారని అడిగితే అరవలేం చెప్తారు? ఆపరిస్థితుల్లో వారికేది సమంజసమని తోస్తుందో అదే చెప్తారు. అందులో నిజానిజాలతోనూ న్యాయాన్యాయాలతోనూ వారికి నిమిత్తం ఉండనక్కరలేదు. కాని తెలుగు మంత్రులు కూడా నిమిత్తంలేకుండా విన్నకున్నారంటే అదే విపరీతంగా ఉంది. “మేమిక్కడ తెలుగుమంత్రులుగా పని చెయ్యడంలేదు. మద్రాసుమంత్రులుగా పనిచేస్తున్నాం”అని శ్రీ గోపాలరెడ్డిగారన్నారు. వారేరకం మంత్రులుగా పనిచేసినా ఆంధ్రదేశానికి అన్యాయం జరుగుతోంటే కళ్లు మూసుకూర్చుంటే వారు విమర్శనీయులే. ఉద్యోగుల్లో తెలుగువారు తక్కువగా ఉన్నారంటే తెలుగువారిలో సమర్థులు లేరని ఈ మంత్రుల అభిప్రాయమై ఉండాలి. అదే వారి అభిప్రాయమైతే అరవల వాదానికి వారు పూర్తిగా లొంగిపోయినారన్నమాట. ఆంధ్రదేశం కీడుమేళ్లని వారు గ్రహించలేని స్థితిలో ఉన్నారని దేశం భావించవలసివస్తుంది. తెలుగువారిలో ఉద్యోగాలికి సమర్థులైనవారు లేదనడంగాని రావడంలేదనడంగాని ఆంధ్రదేశానికి అవమానకరం. అలా ఎవరైనా అంటే అది మోసం. ఇకముందు ఉద్యోగుల నియామకంలో ఆంధ్రుల్ని అధికంగా తీసుకుంటూ లోటు భర్తీచెయ్యాలి. ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మిస్తే ఆ రాష్ట్రాన్ని పరిపాలించడానికి కావలసినంతమంది ఉద్యోగులు లేరని కేంద్రప్రభుత్వం లోపాన్ని ఎత్తిచూపిందేకాని ఈ లోపాన్ని సరిదిద్దవలసిందని మద్రాసుప్రభుత్వాన్ని ఆదేశించలేకపోయింది. మన తెలుగుమంత్రులయినా పూనుకొని ఆంధ్రదేశంపట్ల తమ బాధ్యతను నిర్వర్తించవలసి ఉన్నారు. కాంగ్రెస్‌వారు, చెన్నరాష్ట్రశాసనసభలోని తెలుగుసభ్యులు ఈ విషయమై కార్యవిధానాన్ని ఆలోచించవలసిన అవసరం వచ్చింది.

### కొత్తశాసనసభా భవనం:

కొత్తరాజ్యాంగంప్రకారం ఎన్నికలు జరిగేటప్పుడు చెన్నరాష్ట్రశాసనసభలో 500 పైగా సభ్యులుంటారు. కాని ఆంధ్రరాష్ట్రం నిర్మించబడితే ఈసంఖ్య రెండు రాష్ట్రాలమధ్యనూ మూడు, రెండువంతుల చొ॥ విభజించబడుతుంది. ఆంధ్రరాష్ట్రం ఇప్పుడు నిర్మాణం కాలేదంటే, మున్ముందు నిర్మాణం కాదని భావించడం పొరబాటు. ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి ఎవరి ఇష్టాయిష్టాలతోనూ పనిలేదు. ఇప్పుడు కాకపోతే మరికొన్ని సంవత్సరాలకైనా రాష్ట్రవిభజన జరక్కతప్పదు. ఈపరిస్థితిలో, ఈ కొద్దిరోజులలో చెన్నరాష్ట్రశాసనసభకోసం లక్షలు కోట్లు ధనం వెచ్చించి కొత్త శాసనసభాభవనాన్ని నిర్మించడం కేవలం నష్టంకిందికే వస్తుంది. 500 మంది సభ్యులకు సరిపోయే భవనాన్ని నిర్మించడానికి మద్రాసుప్రభుత్వం తలపెట్టినట్లు ఇటీవల వార్త వచ్చింది. తెలుగుసభ్యులు ఈ యత్నాన్ని ప్రతిఘటించవలసిన అవసరం ఉంది.

[సీతారామ్]

# ఆంధ్రపత్రిక



# ఉగాది సంచిక



ఆంధ్రపత్రిక వికృతి ఉగాది సంచిక సంవత్సరాదికి, అనగా 1950 మార్చి 19 వ తేదీకి వెలువడగలదని తెల్ప సంతసించుచున్నాము.

**మనోజ్ఞమైన ముఖచిత్రము — వికృతిసంవత్సర పంచాంగము**

**విషయ సమగ్రమైన ప్రస్తావన — విజ్ఞానప్రదమైన వ్యాసములు**

**ఆధునిక కవుల పద్యరచనలు — రసవంతమైన కథలు**

**త్రివర్ణచిత్రములు — ఏకవర్ణచిత్రములు — ఛాయాపటములు**

కలిగి, సంచిక సర్వాంగ సుందరముగ వెలువడుచున్నది.

డెమ్మీ క్వార్టర్ సైజున కనీసము 150 పుటలు కలిగియుండును.

## వెల రు. 2 లు మాత్రమే.

మీ సమీపమున గల 'ఆంధ్రపత్రిక' ఏజంటువద్ద గాని మాకు వ్రాసిగాని వెంటనే మీ ప్రతిని రిజర్వు చేసికొనండి.

**పోస్టుద్వారా పంపుటకు ప్యాకింగు, పోస్టేజిలకు అ. 8 లు అదనము.**

మేనేజరు,

ఆంధ్రపత్రిక.

